# తొలి పలుకు

ఇదివరలో గాంధీ సాహిత్య ప్రచురణాలయము "నూతన విద్యా విధానము" అను అనువాదమును ప్రచురించినది. ఈ రెండు పుస్తకములును ఒకదానికి ఒకటి తోడుగా చదువవలసినవి. 1937 లో ఏర్పరచిన నూతన విద్యా విధానమును అర్థము చేసికొనవలెనన్న, నవీన విద్యాపథంలో అన్న గ్రంథము చదివినగాని ఆ విధానము ఎట్లు రూపొందినది మనకు తెలియదు. ప్రస్తుత విద్యావిధాన మందలి లోపములు, నవీన విద్య యేర్పడే సూచనలు, నూతన విద్యావిధానము మున్నగు విషయములు ఇందు చర్చింప బడినవి.

గాంధీ సాహిత్య ప్రచురణాలయ కృషి ఫలితముగా వెలువడిన యీ పదియవ గ్రంథము ఆంధ్ర ప్రజానీకము యొక్క ఆదరమును బడయగలదని యాశించుచున్నాము.

— ప్రకాశకులు

# విషయసూచిక

విభాగము — పుట


సంపాదకుని పీఠిక : 1

మొదటిభాగము : ప్రస్తుత విద్యయొక్క అసమగ్రత

1. పుస్తకవిద్య 3
2. ఆంగ్లవిద్య 8

రెండవభాగము : నూతనవిద్యా విధానముయొక్క తొలిసూచనలు

3. ఇంటివద్ద 18
4. టాల్‌స్టాయి వ్యవసాయ కేంద్రములో 21
5. జాతీయ పాఠశాలలలో 34

మూడవభాగము : నూతనవిద్య

6. నూతనవిద్య ప్రజాసంస్కృతిలోను, వారి జీవితములందును పాదుకొనవలెను. 43
7. నడవడి చక్కబరచుటకు 51
8. వట్టి పాఠపుస్తకముల చదువు చాలదు 55
9. ఆత్మవిశ్వాసమును, చేతిపనియెడల గౌరవమును నేర్పవలెను 60
10. స్వయంపోషకము కావలెను 64

11. విద్యార్థిలోని సర్వశక్తులను వృద్ధిపరచుట 69
12. వృత్తియే కేంద్రముకావలెను. 72

నాల్గవభాగము : మతవిద్యాసమస్య

13. మతవిద్య 74

అయిదవభాగము : భాషాసమస్య

14. విద్యాగరపు భాషాసాధనము 78
15. జాతీయభాష, లిపి 91
16. ఇతరభాషలు 107

ఆరవభాగము : నిర్బంధవిద్య

17. నిర్బంధవిద్య 112

ఏడవభాగము : ప్రత్యేకవర్గములవిద్య

18. వయోజనవిద్య 115
19. స్త్రీ విద్య 118
20. హరిజనవిద్య 120

ఎనిమిదవభాగము : ఉన్నతవిద్య

21. జాతీయ విశ్వవిద్యాలయములు 124
22. విద్యార్థులు 143

# సంపాదకుని పీఠిక

ఈ పుస్తకముయొక్క ఉద్దేశమేమో ముందు తెలుపవలసియున్నది. నవజీవన్ ప్రచురణాలయమువారు గాంధిజీ యొక్క బేసిక్ విద్యనుగూర్చి ఒక పుస్తకము నిదివరకే ప్రచురించినారు. 1937 మధ్యనుండి గాంధిజీ నూతన విద్యా ప్రణాళిక ప్రారంభమయ్యెను. ముఖ్యముగ అప్పటినుండి జరిగిన ఆయన ఉపన్యాసములు, వ్రాసిన వ్రాతలు ఆ పుస్తకమునందు కూర్చబడెను. ఈ ప్రణాళికకు బేసిక్ విద్యయను పేరు వచ్చినది. 7—14 సం॥ల మధ్యవయస్సు బిడ్డల కుద్దేశింపబడిన విద్యావిధానమిది. పూర్వ-బేసిక్, పర-బేసిక్ (అనగా 7 ఏండ్ల వయసుకు పూర్వము. 14 ఏండ్లకు తరువాత ఈయవలసిన విద్య) తమపరి దీనికి చేర్చబడినవి. ఈ మూటిని కలిపి 'నూతనవిద్య' యని 'నయీతాలీమ్' అని యందురు.

నూతనవిద్యను గూర్చిన భావములు గాంధిజీ ఆకస్మికముగ 1937లో వెల్లడించలేదు. అనేక సంవత్సరముల జిజ్ఞాసనుండి, అనుభవమునుండి అవి వెలువడినవి. ప్రస్తుత విద్యాపద్ధతులపై తిరుగుబాటుచేసి, సరియైన విద్యాదర్శమును అన్వేషించి అమలులో పెట్టుటకు ఆయన యత్నించిన ఆ మొదటికాలమునకు సంబంధించిన పుస్తకమిది. 1937లో ఏర్పడిన నూతన విధానమును బాగుగ గ్రహించుటకు ఈ వెనుకటి కాలము

నను మనము మరలవలెను. కనుక "బేసిక్ విద్య" యను పుస్తకమునకు ఇది అవసరమగు అనుబంధముగ నుండగలదు.

ఇందలి విషయములు ప్రొఫెసర్ నిర్మల కుమారబోసు, ప్రొఫెసరు అన్నదనాథబోసు గార్లచే సేకరింపబడినవి. వానిని ప్రస్తుతరూపమున సిద్ధము చేయుటతో వారికి సంబంధము లేదు.

విద్యా సంస్కరణనుగూర్చి గాంధిజీ అభిప్రాయము లెట్లు క్రమపరిణామమును జెందెనో తెలియుటకు వీలగునట్లు ఒక క్రమమున ఆయన వ్రాతలిందు పొందపరుపబడినవి. మొదటి భాగము తిరుగుబాటు కాలమునకు, రెండవ భాగము ప్రయోగములకు, మూడవది మరి మిగత విభాగములు సిద్ధాంత నిరూపణకు సంబంధించియున్నవి. పరస్పరసంబంధము లేని కఠినవిభాగములు కావాలి. ఎందులకనగా, తిరుగుబాటు, ప్రయోగముల మొదటికాలము నందే గాంధిజీ సిద్ధాంతములను కూడ వివరించుచుండెను. అయినను గాంధిజీ భావపరిణామ మెట్లు నడచెనో తెలిసికొనుటకు ఇందు కూర్పబడిన రచనల క్రమము సహకరించగలదు.

ఈ క్రమమునకు సరిపోవునట్లుగ అధ్యాయముల పేర్లుకూడ చాలవరకు మార్చబడినవి.

బొంబాయి భరతన్ కుమారప్ప.

# మొదటి భాగము

# ప్రస్తుత విద్యయొక్క అసమగ్రత

## 1

## పుస్తక విద్య

సంపాదకుడు (గాంధిజీ) : అక్షరజ్ఞానమే విద్య యనుట వాడుకైనది. చదువు, వ్రాత, గణితము నేర్పుట ప్రాథమిక విద్య యనబడుచున్నది. వ్యవసాయదారుడు న్యాయమార్గాన తిండి సంపాదించుకొనును. సామాన్య లోకజ్ఞాన మతనికున్నది. తల్లిదండ్రులు, భార్యా బిడ్డలు, తోడి గ్రామస్తులు—వీరందరి యెడలను తానెట్లు ప్రవర్తించవలెనో అతడెరుగును. నైతిక నియమముల నతడు అర్థముచేసుకొని ఆచరించును. కాని తనపేరు తాను వ్రాయలేడు. అట్టివానికి చదువుచెప్పి వాని నేమి చేయవలెనని మీ యుద్దేశము? తద్వారా అతని సుఖమును కొంచమైన పెంచగలరా? ఆ పూరిల్లు, దారిద్ర్యం యెడల అతనికి అసంతృప్తి కలిగించవలెననియా మీ తలంపు? మీరట్లు చేయదలచినను అట్టివిద్య అతనికి అవసర మని పించదు. పాశ్చాత్యభావవాహినిలో కొట్టుకొని పోవుచున్న మనము ఉచితానుచిత విచారణలేక, ప్రజ కీమాదిరి విద్య నీయవలెనని తీర్మానించుకొన్నాము.

ఇక ఉన్నతవిద్యను తీసికొందము. నేను భూగోళ, ఖగోళ శాస్త్రములను, బీజ, క్షేత్రగణితములను నేర్చుకొంటిని. అయిన నేమి ? తేపస్మాలమున నేను నాకుగాని పొరుగువారికి గాని ఎట్లుపయోగపడ గలిగినాను ? ఈ శాస్త్రములను నే నెందుకు నేర్చుకొన్నట్లు ? హక్స్లే పండితుడు విద్య నిట్లు నిర్వచించినాడు.

"ఎవనిశరీరము చిత్తమునకు పూర్తిగా లోబడి చేతనైనంతగ ఆనందముతో పనిచేయ సంసిద్ధమో, ఎవనిబుద్ధి నిర్మలము, శాంతియుక్తము, సర్వాంగసౌష్ఠవము అయి చక్కగ పనిచేయునో, ఎవనిమనస్సు మూలసత్యములపై ఆధారపడిన ప్రకృతి విజ్ఞానముతో నిండియుండునో, ఎవని యుద్రేకములు క్రమశిక్షణద్వారా బలమైన ఇచ్ఛాశక్తికిని, మృదువైన మనస్సాక్షికిని అధీనమువుతవో, ఎవడు సమస్త నీచప్రవృత్తులను అసహ్యించుకొనుచు అందరను తనవలెభావించి గౌరవించునో, అతడే ధారాళమగు విద్యనభ్యసించిన వాడనదగును. ఎందువల్లననగా, ప్రకృతితో కలసియే అతని జీవితము నడచును. ప్రకృతి, అతడు, పరస్పరము సంపూర్ణ సహకారముతో బ్రతుకుదురు."

నిజమగువిద్య ఇదేయైనచో, పై శాస్త్రములేవియు నా యింద్రియ నిగ్రహమునకు తోడ్పడ లేదని ఘంటాపథముగ చెప్పగలను. కనుక ప్రాథమిక విద్యయనుడు, లేక ఉన్నతవిద్యయనుడు, ముఖ్యమైన పనికి అది ఉపయోగపడుట లేదు. అది మనకు మనుష్యత్వము నీయ లేదు, కర్తవ్యపాలనము చేయించ లేదు.

పాఠకుడు : అట్లైతే, ఇన్ని విషయములు మీరు నాకెట్లు చెప్పగలుగుచున్నారు. ఉన్నతవిద్యవలన కానిచో మీ కింత వివరణశక్తి ఎట్లు కలిగినది ?

సంపాదకుడు : ఇది మంచి ప్రశ్న. అయితే జవాబు మాత్రము చాల సులువు. ఉన్నత లేక ప్రాథమికవిద్యను పొందియుండనిచో నా బ్రతుకు నిరర్థకమయ్యెడిదని నే నేమాత్రమును నమ్మను. మాట్లాడు శక్తియుండుట చేతనే నేను మాట్లాడగలుగుచున్నా ననుకొనుటకూడ సరికాదు. కాని సేవచేయు కోరిక నాకున్నది. దానిని నెరవేర్చుకొనుటకు గాను నేను నేర్చినవిద్యను ఉపయోగించుకొందును. అదైనను కోట్లాది ప్రజానీకముకొరకు కాదు. మీవంటి వారికోసమే అది ఉపయోగించును. మన మిరువురమును కృత్రిమవిద్య యొక్క దుష్ప్రభావము క్రిందికి వచ్చినవారమే. నేను ఆ చెడుగునుండి తప్పుకొని నా అనుభవలాభమును మీకు తెలుప యత్నిస్తున్నాను. నేటి విద్యలోని కుళ్లును నిరూపించుచున్నాను.

అట్లని అన్ని సందర్భములలోను అక్షరజ్ఞానాన్ని నేను ఖండించను. నేను అనునదంతయు ఇదియొక మూఢనమ్మిక కారాదనియే. అక్షరజ్ఞానము మన కామధేనువు కాదు. దాని స్థానమునం దదియున్నచో ఉపయుక్తము కాగలదు. ఇంద్రియ నిగ్రహము నీతివర్తన స్థిరపడినచోట అది పనిచేయును;

దాని ఫలితమును మనము పొందగలము. అప్పుడది మనకొక మంచి అలంకారము కాగలదు. కనుక అట్టివిద్యను మనము నిర్బంధము చేయపనిలేదు. మన ప్రాచీన విద్యాపద్ధతి మనకు చాలును. శీలమును వృద్ధిపరచుకొనుటయే అందలి ప్రధాన విషయము. అదే ప్రాథమికవిద్య. ఆ పునాదిపై నిర్మింపబడు గృహము సుస్థిరముగ నిలిచియుండును.

హింద్ స్వరాజ్ (1908) అధ్యా. 18.

పుస్తకపు చదువునుగూర్చిన ఛాందసము నా కెన్నడును లేదు. పుస్తకవిద్య మానవుని నైతికోన్నతికి ఇంచుకైన సహకరించదని; చదువు వేరు, సద్గుణము వేరని స్వానుభవము వలన నాకు ఋజువైనది. ప్రభుత్వ పాఠశాలలు మన మానుషత్వమును చెరచి, మనను నిస్సహాయులుగను, నాస్తికులుగను చేసినవని నా నిశ్చితాభిప్రాయము. అవి మనలను అసంతృప్తితోను నిరాశతోను నింపినవి. ప్రభుత్వపు గుమాస్తాలుగను, ముబాసీలుగాను మనలను తయారుచేసినవి.

యంగ్ ఇండియా. 1 - 6 - '21.

ఈ విద్య ప్రజానీకపు ఆవశ్యకతలను తీర్చుచున్నదా యన్నది ప్రశ్న. మిగత ఇండియాలోవలెనే బరోడాలో కూడ ప్రజాబాహుళ్యమునకు సేద్యమే వృత్తి. ఆ కర్షకుల బిడ్డలు మంచి కర్షకులుగ తయారగుచున్నారా ? వారు నేర్చు విద్యవలన వారిలో నైతిక లేక ఆర్థికాభివృద్ధియేమైన కనబడు

చున్నదా? ఈ ప్రశ్నకు తృప్తికరమైన సమాధానమురాదని నా భయము. ఫలితము కనబడుటకు 50 సంవత్సరముల కాలము చాలును. బరోడా కృషికులు ఎక్కువవృద్ధిలో గాని సుఖవంతులుగగాని లేరు. కరవుకాలములో మిగత దేశస్థు లెంత నిస్సహాయులై యుంటున్నారో వీరును అంతే. ఇతరచోట్ల గ్రామ పారిశుధ్యమెంత అధ్వాన్నముగనున్నదో ఇక్కడను అంతే. తమ వస్త్రములను తాము నేసికొనుటలో గల విలువనుకూడ వారు గుర్తించరు. దేశమున అత్యధిక భూసారముగల ప్రదేశములలో బరోడా ఒకటి. తాను పండించు ముడిప్రత్తిని పై దేశాలకు పంపివేయరాదు. సంపన్న కృషీవలులతోనిండి సులువుగా అదియొక స్వయంపోషక రాష్ట్రముకాగలదు. కాని బరోడా విదేశీవస్త్రాలతో అలంకృతమైయున్నది. ఇది దారిద్ర్యమునకు పతనమునకు నికరమైన గుర్తు. మద్యపాన నిషేధమునకూడ వా రితరుల కంటె మించిన దేమియు లేకపోగా, వెనుకబడి యున్నారని యే చెప్పవలెను. బరోడా విద్యా నిర్వహణముకూడ కల్లు సారాయీలతోనే కళంకితమైయున్నది. "కాలిపరాజీల" బిడ్డలు విద్య నభ్యసించుచు, మద్యపాన భూతమువలన వినాశము నొందుచున్నారు. బరోడా విద్యాపద్ధతి చాలమట్టుకు బ్రిటిషు నమూనాయొక్క నీచానుకరణమే. మన ఉన్నతవిద్య మనలను స్వదేశములోనే విదేశీయులుగా చేయుచున్నది. ప్రాథ

మికవిద్య నిజమగు బ్రతుకుతెరువును చూపలేక, నిష్ప్రయోజకమగుచున్నది. అందు స్వతంత్రభావనా సమర్థతగాని, స్వాభావికతగాని లేదు. పాతబడి పనికిమాలినదానినుండి క్రొత్తకల్పన లెట్లురాగలవు ?

యంగ్ ఇండియా. 21 - 1 - '26.

## 2

## ఆంగ్ల విద్య

### ఆంగ్ల విద్య

పాఠకుడు : అయితే స్వరాజ్య సంపాదనకు, మీదృష్టిలో ఆంగ్లవిద్యతో పనియే లేదన్నట్లు భావింపవచ్చునా ?

సంపాదకుడు : (గాంధిజీ) అవునని, కాదనికూడ నాజవాబు. కోట్లకొలది ప్రజకు ఆంగ్లభాష నేర్పుట వారిని బానిసలను చేయుటే. ఆంగ్లవిద్యకు మెకాలేవేసిన పునాదివలన జరిగిన పనియిది. అతడు దానిని బుద్ధిపూర్వకముగ చేసినాడని నే నను. కాని కలిగినఫలితమదే. స్వరాజ్యమునుగూర్చి మనము విదేశభాషలో మాట్లాడుకో వలసివచ్చుట శోచనీయము కదా !

ఐరోపావారు విసర్జించిన సిద్ధాంతములు మనకు ఆచరణలో నున్నవని మనము గుర్తించవలెను. అక్కడి విద్వాంసులు ఎప్పటి కప్పుడు వలసిన మార్పులను చేసికొనుచుందురు.

మనమో. వారు తీసి పారవేసిన పద్ధతులకు అంటిపెట్టుకొని కూర్చుందుము. అచ్చటి ప్రతిరాష్ట్రమును తనస్థితిని బాగు చేసికొనుటకు ప్రయత్నించును. ఇంగ్లాండులో ఒకచిన్న భాగము వేల్సు. అక్కడి ప్రజలలలో వెల్షు భాషాభివృద్ధికి తీవ్రకృషి జరుగుచున్నది. వేల్సుబిడ్డలు స్వభాషలో మాట్లాడుకొనునట్లు చేయు ఉద్యమంలో ఆంగ్లఖాన్ సెలరు లాయిడ్ జార్జి ప్రధానపాత్ర వహించినాడు. మనమిక్కడ వ్రాయునది తప్పుడు ఇంగ్లీషు. మన ఎం. యే. లస్థితికూడ ఇదే. మన ఉత్తమభావాలను ఇంగ్లీషులోనే వ్యక్తపరచ వలసి యున్నాము. కాంగ్రెసు సభాకార్యక్రమము ఆంగ్లము తోనే నడచుచున్నది. మన ప్రఖ్యాత వార్తాపత్రికలు ఆభాషలోనే ముద్రితము లగుచున్నవి. ఈస్థితి చిరకాలమిట్లే యున్నచో, ముందుతరములవారు మనలను దూషించి దుమ్మెత్తిపోయుదురని నా నమ్మకము.

మనము ఆంగ్లవిద్యను నేర్చి మనజాతిని బానిసజాతిగ తయారుచేసినామని మరువకుందుము గాక! మోసము, నిరంకుశత్వము పెరిగినవి; ఇంగ్లీషునేర్చిన ఇండియనులు ప్రజలను మోసగించి భయపెట్టుటకు జంకరు ప్రజలకొరకై మనమిప్పుడేదైన చేయుచున్నామనిన, వారికి తీర్చుకోవలసిన ఋణములో అల్పాంశమును తీర్చుచున్నామన్న మాట.

నేను న్యాయస్థానమునకు వెళ్లితే, అక్కడ వాడవలసినది

ఇంగ్లీషు. నా బారిష్టరీపనిలో నా మాతృభాషను మాట్లాడరాదే! మాతృభాషనుండి మరొకరు నాకుగాను తర్జుమా చేయవలసియుండును. ఇదెంత అసంగతము! ఇది బానిసత్వ చిహ్నముకాదా! దీనికి నేను నిందించవలసినది ఆంగ్లేయులనా, లేక నన్నేనా? ఇండియాను బానిసగాచేసినది ఇంగ్లీషు నేర్చిన మనమే. ఈ జాతిశాపము మనకే తగులును కాని ఆంగ్లేయులకు కాదు.

మీ చివరిప్రశ్నకు నా జవాబు 'అవును' 'కాదు' కూడ అని యన్నాను. ఎట్లది 'అవునో' చెప్పినాను. ఎందుకు 'కాదో' వినుడు.

ఆంగ్లవిద్యను పూర్తిగా వదలి మనము బ్రతకలేకున్నాము. నవనాగరికతయను రోగము మనల నింతగా పట్టివేసినది. ఇంతకుముందే ఆ విద్య నేర్చియున్నవారు కావలసినపుడు దానిని సద్వినియోగము చేసికోవచ్చును. ఆంగ్లేయులతో గాని, మనవారితోగాని పనియుండి ఆంగ్లములోనే ఉత్తర ప్రత్యుత్తరములు జరుపవలసియుంటేగాని, ఆంగ్లేయులే తమ నాగరికతతో తామెంత విసిగియున్నారో తెలిసికొనుటకు గాని మన ఇంగ్లీషును ఉపయోగించుకొనవచ్చును. తాము ఇంగ్లీషు చదివినవారైనను, తమబిడ్డలకు నీతిధర్మమును మాతృభాష తోనే బోధించుచు, వారికి మరొక భారతీయభాషనుగూడ నేర్పవలెను. వారు పెద్దవారైనపుడు, కావలసినచో, ఇంగ్లీ

షను నేర్వవచ్చును. చివరకు మనకాభాష నిజముగ అనవసర మని తేలిపోవలె. తద్వారా ధనార్జనచేయు ఉద్దేశ్యముండ రాదు. ఈ కొలదిమాత్రపు ఇంగ్లీషు చదువులలో గూడ, దానిద్వారా మనము నేర్వదగినదేమో, తగనిదేమో నిర్ణ యించుకొనవలె. మనము ఏయే ప్రకృతి శాస్త్రములు పఠించవలెనో నిర్ణయించుకొనుట అవసరము. ఇంగ్లీషు డిగ్రీల వ్యామోహము మనలో అంతరించిన తక్షణమే మనప్రభు వులు చెవులు రిక్కించిచూచెదరు.

హింద్ స్వరాజ్ (1908). అధ్యా. 18.

## గుమాస్తాలను తయారుచేయు విద్య

మద్రాసు విద్యార్థులగు మీరును, మరియావద్భారత విద్యార్థులును నేర్చుచున్నది-మీ లోపలి ఉత్తమశక్తులను వికసింపజేయగల ఆదర్శవిద్యా? లేక వ్యాపారసంబంధమగు ఆఫీసులలో గుమాస్తాలను, తదితర ప్రభుత్వోద్యోగులను తయారుచేయు కార్ఖానా విద్యా? గవర్నమెంటులోను, తది తర శాఖలలోను ఉద్యోగములు సంపాదించుకొనుట మాత్ర మేనా మీ విద్యావ్యాసంగముయొక్క లక్ష్యము? మీ చదువు లోని ఉద్దేశ్యము, దాని యాదర్శము అంతమాత్రమేయైనచో కవి రవీంద్రుడు చిత్రించిన దివ్యాదర్శము మన కందకుండ పోవును. నవీన నాగరికతకు నేను ప్రబల శత్రుపునని చెప్పగా

మీరు విని, లేక చదివి యుండవచ్చును. నేడు యూరపులో ఏమి జరుగుచున్నదో మీరు దృష్టిసారించి చూతురుగాక! నవనాగరికతయొక్క త్రొక్కుడులోబడి ఐరోపా ఘూర్ణిల్లు చున్నది. ఈ మాట మీకు నిర్ధారణమైతే, మీరు, మీ పెద్దలు ఈ దేశమున ఆ నాగరికతతో తులతూగ యత్నించుటకు పూర్వము క్రమముగ యోచించుకోవలసి యుందురు. "మనపాలకులే మనకు దానిని తెచ్చిపెట్టియుండగా, మనమేమి చేయగలము?" అని కొందరు నాకిచ్చిన సమాధానము. ఇందు మీ రెంతమాత్రము పొరపడరాదు. మీకది అక్కర లేనపుడు, పాలకులు తెచ్చి దానిని మనపై బెట్టగలరనినే నేమాత్రమును నమ్మలేను. ఒకవేళ వారట్లు చేసినను, దానిని నిరాకరించగలశక్తులు మనలోనే యున్నవి.

గాంధి మహాత్ముని ఉపన్యాసములు, వ్రాతలు. పుట312, 13. - 27 - 4 - 15

## ఆంగ్లవిద్య

మనకీయబడిన ఆంగ్ల విద్యా విధానము ఇంగ్లీషు చదివిన భారతీయులను నిర్వీర్యులుగ జేసినది. విద్యార్థుల నరముల పటుత్వమును విపరీతముగ లాగివేసినది. అనుకరించువారినిగ మనలను తయారుచేసినది. దేశభాషలను నశింపజేసిన ఈ విధానము బ్రిటిషు ఇండియా చరిత్రలోకెల్ల అత్యంత విషాద

కర ఘట్టము. రామమోహనరాయలు ఇంగ్లీషులో ఆలోచించుచు, ఇంగ్లీషులో భావప్రకటన చేయవలసిన ఇబ్బందిలో పడియుండనిచో అతడింకను గొప్ప సంస్కర్త అయి యుండు వాడు. ఇట్లే లోకమాన్యతిలకు కూడ మరింత గొప్పవిద్వాంసుడై యుండువాడు. ఈ యిరువురి ప్రభావమును దేశీయులపై అద్భుతముగ పనిచేసినను, సహజమగు విద్యాపద్ధతిలో వారు తయారయి యుండినచో, వారి ప్రభావము ఇంకను అద్భుతమైయుండెడిది. ఆంగ్లసాహిత్య ధనాగారమునుండి వారిరువురును జ్ఞానమును పొందియుండుట వాస్తవమే. కాని ఇది వారికి తమ మాతృభాషలనుండియే లభించి యుండ వలసినది. కేవలము అనుకరణము వలన యే దేశమునందును జాతీయత యేర్పడదు. బైబిలుకు అధికారయుతమైన ఆంగ్లానువాదము లేక యుండినచో ఆంగ్లేయులగతి యేమై యుండునో ఊహింపుడు. చైతన్యుడు, కబీరు, నానకు, గురుగోవిందుడు, శివాజీ, ప్రతాపసింహుడు మహావ్యక్తులని నా తలంపు. తర తమ భేదము లెంచుట అసహ్యకరమని నేనెరుగుదును. అందరును ఎవరికివారు పెద్దలే, సమానులే. కాని ఫలితములను బట్టి విచారించినచో, ప్రజానీకముపై రామమోహనతిలకుల ప్రభావము వారికంటె అదృష్టజాతకు లగు చైతన్యాదుల ప్రభావమువలె శాశ్వతమును, విస్తృతమును కాదు. వారెదుర్కొనవలసి యుండిన అడ్డంకులనుబట్టి

వారును వీరు లే. కాని వారుపొందిన ఆంగ్లశిక్షణవలని నష్టమే లేక యుండినచో, వారింకను గొప్ప కార్యములను సాధించి యుండువారు. ఆంగ్లభాషాజ్ఞానము లేకుండినచో, రామ మోహన లోకమాన్యులలో అంతటి భావనాపటిమ యుండెడిది కాదనుమాటను నేనునమ్మను. స్వాతంత్ర్య భావములనుకలిగించుకొనుటకుగాని, సూక్ష్మప్రభావనాశక్తిని వృద్ధిచేసికొనుటకుగాని ఆంగ్ల భాషాజ్ఞానమావశ్యక మను కొనునంతటి మూఢనమ్మిక ఇండియాలో మరొకటుండబోదు. ఇప్పటికి ఏబది సంవత్సరములనుండి, ఒకేరకపు విద్యాపద్ధతి ఇక్కడ అమలుజరుగుచున్నది. శిక్షణకు సాధనముగ ఇంగ్లీషే బలాత్కారముగ విధింపబడి యున్నదని మనము మరువరాదు. ఇప్పుడు గరపబడువిద్య లేకున్నచో మన మేమయి యుందుమో తెలిసికొగల ఆధారములు లేవు. కాని మనకు స్పష్టముగ తెలియగల విషయమిది : ఏబది యేండ్లకు పూర్వముకంటె ఇండియా దారిద్ర్యమిప్పుడు పెరిగినది. స్వయంరక్షణశక్తి తగ్గినది. దేశసంతానము దుర్బలులైనారు. దీనికి కారణము ప్రభుత్వవిధానము నందలి, లోపములని నాకు చెప్పబనిలేదు. విద్యావిధానమే అందున్న మిక్కిలి గొప్పలోటు.

అసలు పుట్టుకలోనే ఇది తప్పుడుత్రోవ బట్టినది. ఎందు చేతననగా, దేశీయవిద్యాపద్ధతి కేవలము పనికిమాలినదని

ఆంగ్ల పరిపాలకులు అభిప్రాయపడిరి. ఈ విద్య పాపమునందు పెరిగినది. భారతీయుల శారీరక మానసిక, ఆత్మశక్తులను నశింపజేయుటకే అది పనిచేసినది.

యంగ్ ఇండియా : 27 - 4-21

## టాగూరు కిచ్చిన జవాబు.

నాయింటిని అన్నివైపుల గోడలతో బంధించుట, కిటికీలను మూసిపెట్టుట నాకిష్టములేదు. నానాదేశ సంస్కృతులు నాయింట ఎంతస్వేచ్ఛతో వీచినను వీచవలసినదే. కాని నాకు నిలువ నీడ లేకుండచేయు ప్రతిదానిని నేను ప్రతిఘటింతును. పరాయివాండ్ల యిళ్లలో బిక్షుకునిగనో, బానిసగనో బ్రతుకుట నాకు గిట్టదు. బడాయికోరుతనమునకు గాని, వివాదాస్పదమైన సాంఘిక ప్రయోజనాలకోసము గాని నాసోదరీమణులను ఇంగ్లీషు చదువవలసిన అవస్థపాలుచేయను ఆ సారస్వతమందు రుచిగల మన యువతీయువకులు కోరినంత ఆంగ్లభాషను, తదితర ప్రపంచభాషలను నేర్చుకోవచ్చును. తమవిద్యవలన లభించిన ప్రయోజనాలను జగదీశచంద్రబోసు వలెను, ప్రఫుల్ల చంద్రరాయివలెను, కవి రవీంద్రునివలెను ఇండియా ప్రజకును, ప్రపంచమునకును పంచిపెట్టవచ్చును. కాని ఏ యొక్క భారతీయుడును తన మాతృభాషను మరచిపోవుట, నిర్లక్ష్యముచేయుట, దానిని గూర్చి సిగ్గుపడుట పనికిరాదని నాయభిప్రాయము. మాతృ

భాషలో ఉత్తమ భావములను భావించి, వ్యక్తపరచుట అసాధ్యమని యనుకొనుట పెద్ద పొరపాటు. నాది సంకుచితమగు బందిఖానా మతముకాదు. దైవసృష్టిలోని అట్టడుగు వానికికూడ అందు స్థానమున్నది. కాని అందు అహంకారమునకుగాని, జాతి, మత, రంగులనుగూర్చిన గర్వమునకుగాని స్థానము లేదు.

యంగ్ ఇండియా : 1 - 6 - 21

## ఆంగ్లసారస్వతమునుండి అనువాదములు చాలును-

ఇంగ్లీషు చదువుకు తక్కువ సమయ మీయుమని మన స్త్రీపురుషులను నేను కోరుచున్నాను. ఇంగ్లీషునుండి వారు పొందగల ఆనందమును పొందకుండచేయుట కాదు నాయుద్దేశ్యము. అంతకంటె ఎక్కువ సహజపద్ధతిలో, తక్కువఖర్చు, శ్రమతో ఆయానందమును పొందవచ్చునని నావాదన. అత్యంత సుందరములైన అనేకమణులతో ఈప్రపంచము నిండియున్నది. కాని అవన్నియు ఆంగ్లరూపు రేఖలు కలవి కావు. ప్రతిభాన్వితములయిన వ్రాతలు, సాహిత్యము తమకును కలవని ఆంగ్లేతర భాషలు కూడ సగర్వముగ చెప్పకో గలవు. అయితే ఇవన్నియు సామాన్యప్రజల కందుబాటులోనికి తేబడవలయును. మనపండితులు వానిని దేశభాషలలోనికి తెచ్చుటవలన ఆపని జరుగగలదు.

మహాత్మగాంధి వ్రాతలు, ఉపన్యాసములు :
పుట 426 - 28 ; 20 - 2 - 18.

రెండవ భాగము

# నూతన విద్యావిధానము యొక్క తొలి సూచనలు

## విద్యలో ప్రయోగముల ఆవశ్యకత

టక్కరితనము, ఆత్మవంచన, ఆచారదాస్యము హెచ్చి పోవుచున్నవి. భవిష్యత్తులో భారత సంతానము యొక్క అభ్యుదయమునకు మూలము విద్యాక్షేత్రము. ఇందులకు సంపూర్ణమైన నిష్కాపట్యము. సత్యాన్వేషణలో నిర్భీతి, సాహసముతో గూడిన ప్రయోగములు అవసరము. ప్రయోగములు కట్టుదిట్టమైనవి కావలెను. అవి ఆత్మార్పణతోను, పరిశుద్ధహృదయముతోను, గంభీరమగు యోచనతోను, చేయబడవలె. ప్రతి అపాత్రుడును ఈవిద్యా ప్రయోగములను చేయరాదు. చక్కని ప్రయోగములు చేయుటకు క్షేత్రము విశాలముగ నున్నదికాని పేరాశతో బంగారము కొరకు వెదకులాడు వానివలె తొందరపడి అవివేకపు పరిశోధనలకు పూనుకొనుట చాల ప్రమాదకరము.

యంగ్ ఇండియా : 30 - 9 -26

# 3.

## ఇంటివద్ద

### గృహశిక్షణ

1897 జనవరిలో నేను డర్బన్‌లో ఓడ దిగినపుడు నాతో ముగ్గురు బిడ్డలుండిరి. నా సోదరి కుమారుడు పదేండ్ల వాడొకడు, తొమ్మిది, అయిదు వయస్సులుగల నాకొడుకు లిద్దరు. వాళ్లకు విద్య ఎక్కడ చెప్పించవలెను ? వాళ్లను తిరిగి ఇండియాకు పంపివేయుట నాకిష్టములేదు. చిన్నపిల్లలను తల్లిదండ్రుల నుండి విడదీయరాదను నమ్మకము నాకప్పటికే యుండెను. నియమనిష్ఠలుగల స్వగృహమందు బిడ్డలు సహజముగ పొందగలుగు శిక్షణ వసతి, గృహాలలో పొందగలుగుట అసంభవము. అందుచే వీరిని నావద్దనే ఉంచుకొన్నాను. అనుకొన్నంత సమయము నేను వారి కీయలేకపోతిని. తగినంత శ్రద్ధ నేను చూపలేకపోయి నందునను, ఇతరములగు అనివార్య కారణముల చొప్పునను నేననుకొన్నంత పుస్తక విద్య వారికి లభించలేదు. ఈ విషయమై నా కుమారు లందరికి నాతో తగవుండనేయున్నది. ఏ ఎం. యే నో, బి. యే నో, మెట్రిక్యులేటునో చూచినపుడు తమకు పాఠశాల విద్య లేకపోయెనని వారు బాధ పడుదురు.

కాని నేను వారిని బయటి పాఠశాలలకు పంపియుండినచో, జీవితానుభవమనెడు శిక్షణను, తల్లిదండ్రులతోడి సన్నిహిత సంబంధమును కోల్పోయి యుందురు. అట్లైతే వారివిషయమున నాకీనాడు ఉన్నంత నిశ్చింత, మనశ్శాంతి ఉండెడిది కాదు. నానుండి దూరమై ఇంగ్లాండులోనో, దక్షిణాఫ్రికాలోనో వారు పొందియుండగల కృత్రిమవిద్య, వారిలో ఈనాడు కనబడుచున్న సేవానిరతిని, నిరాడంబరత్వమును, నేర్పగలిగియుండదు. అప్పుడు వారికబ్బియుండు కృత్రిమ జీవనము నే జేయు దేశసేవకు కూడ ప్రతిబంధకమై యుండెడిది. వారికిని, నాకును తృప్తి నీయగల సాహిత్యమును నే నీయజాలకపోయినను, నాకర్తవ్యమును నేను శక్తివంచన లేక నెరవేర్చుకొంటినని చెప్పగలను. వారిని సర్కారు బడులకు పంపియుండనందుకు నేను చింతింపను. నా పెద్దకుమారునిలో నేడు కనబడుచున్న అవగుణములు సుశిక్షితము, క్రమబద్ధముకాని నాచిన్ననాటి జీవితముయొక్క ప్రతిధ్వని యని నే ననుకొనుచుందును. నాటి నాజీవితము మిడిమిడి జ్ఞానముతోను విషయ లోలత్వముతోను గడచెనని నానమ్మకము. ఆకుర్రవాని మనస్సుకు మంచిచెడ్డ అనుభవములు నాటి లేత వయస్సుకూడ అదే. కాని అది కట్టుబాటులేని నా విషయాసక్త జీవనదశయని వాడొప్పుకొనడు. అదే నాపరిపక్వదశ యనియు, నియమబద్ధమని నే ననుకొన్న నా తరువాతి దశ

వట్టిభ్రమ, అహంభావయుతమనియు నాకుమారుని అభిప్రాయము. సరే. వాడట్లె అనుకొనవచ్చును; ఎందుకు అనుకొనకూడదు? ఈ సందర్భమున స్నేహితులు తరుచు కొన్ని గడ్డుప్రశ్నలు నన్నడుగుచుందురు. నా పిల్లలకు పాఠశాల విద్య నిష్ఫలమైయున్నచో, రాగలహానియేమి? వారిరెక్కలట్లు కత్తిరించి, వారిస్వేచ్ఛ నపహరించుటకు నాకుహక్కేమియున్నది? వారి పట్టపరీక్షలకొరకుగాని, వారికిష్టమున్నవృత్తి నెన్నుకొని బ్రతుకుటకుగాని, నే నెందులకు అడ్డు నిలువవలెను? —ఇత్యాది ప్రశ్నలు.

ఈ ప్రశ్నలలో విశేషప్రాముఖ్యమున్నదని నే ననుకొనను. విద్యార్థులెందరితోనో నాకు పరిచయముండుచు వచ్చినది. నేను స్వయముగను, ఇతరుల ద్వారాను. నా యిష్టసిద్ధాంతములను బిడ్డలపై ప్రయోగించి, వాని ఫలితములనుగూడ చూచుకొంటిని నా కుమారులతో సమవయస్కులగుయువకులిప్పటికిని నే నెరిగినవారున్నారు. నాకుమారులతో పోల్చినచో అం దేయొక్కడును వీరిని మించి యుండడని, వారివద్ద వీరు నేర్చుకొనదగిన దంతగా ఉండదని నా యభిప్రాయము.

కాని, నా ప్రయోగముల తుదిఫలము భవిష్యత్కాలగర్భమునందున్నది. నియమబద్ధమైన గృహ విద్యకును, స్కూలు చదువుకును గల భేదమును, తల్లిదండ్రులు తమ

బిడ్డల జీవితములో తీసికొనిరాగల మార్పులను, కొంతవరకు తెలుపుటకుగాను నే నీవిషయము నిచట కొంతచర్చించినాను. సత్యారాధకుని సత్యప్రయోగములు అతని నెంత దూరము తీసుకొనిపోగలవో, స్వాతంత్ర్యదేవత అతనినుండి ఎన్ని త్యాగములను కోరునో, స్వాతంత్ర్య ప్రియునికి సూచించుటగూడ ఈయధ్యాయముయొక్క ఉద్దేశము. నా ఆత్మగౌరవమును చంపుకొని, ప్రజలందరికిని అందుబాటులోలేని విద్యను నాబిడ్డలకిప్పించి నేను తృప్తినొంది యున్నచో, స్వేచ్ఛ, ఆత్మగౌరవములయొక్క ప్రత్యక్షపాఠమును వారికి లేకుండ చేసియుండెడువాడను. స్వేచ్ఛనో, విద్యనో ఇం దేదో ఒకటిమాత్రమే కోరుకొనవలసి యున్నచో, రెండవదానికంటె మొదటిదే వేయిరెట్లుగ కోరుకొనదగినదని ఎవరనకుందురు ?

స్వీయచరిత్ర. (1926) పుట 245 - 48.

# టాల్‌స్టాయి వ్యవసాయ కేంద్రములో

## టాల్‌స్టాయి వ్యవసాయ క్షేత్రములో విద్య

క్షేత్రము వృద్ధియైనకొలది అందుండు బాలబాలికల విద్యాభ్యాసమునకు తగు యేర్పాట్లు చేయవలసియుండెను. మామూలు విద్యాపద్ధతిలో నాకు నమ్మకము లేదు. అను

భవముద్వారాను, ప్రయోగముల మూలమునను, సరియైన విధానమును కనుగొనవలెనని నా మనస్సుకోరెను. నిజమైన విద్య తల్లిదండ్రులనుండి రావలెనని, బయటివారి సహాయము చాల స్వల్పముగ నుండవలెనని టాల్‌స్టాయి కేంద్రమొక కుటుంబమని, అందు పితృస్థానము నాదియని, పిల్లల శిక్షణకు వీలైనంత బాధ్యత నేనే వహించవలెనని—ఇంతమాత్రమే నాకు తెలిసియుండెను.

ఈ యాలోచనలో కొన్ని పొరపాట్లు లేకపోలేదు. ఆచిన్న వాళ్లు శైశవమునుండి నాతో నుండినవారు కారు. వివిధ పరిస్థితులలోను వాతావరణములలోను పెరిగినవారు. అందరిది ఒకమతముకాదు. కుటుంబ పెద్దరికము నేనువహించి యుండినను, ఇన్ని రకరకముల యువతీ యువకుల విషయమున పూర్తి న్యాయమెట్లు జరుగగలదు?

కాని నే నెప్పుడును హృదయ సంస్కారమునకును నీతి వర్తనకును మొదటిస్థాన మిచ్చుచుంటిని. పిల్లల వయస్సుల లోను, పెంపకములోను, ఎన్ని భేదములున్నను, నీతిశిక్షణ అందరికి సమానమే యనునమ్మకము నాకుకలిగెను. కనుక రాత్రింబగళ్లు వారిమధ్యనే బ్రతుకుచు అందరికిని తండ్రినై యుండవలెనని నిశ్చయించుకొంటిని. శీలమును పెంపొందించుటయే విద్యకెల్ల మూలమని నేను గ్రహించితిని. ఈ పునాది గట్టిగపడినచో, మిగత విషయములన్నిటిని బిడ్డలు

తమంతట తాముగాని, మిత్రుల సహాయమునగాని నేర్చు కొనగలరని నిశ్చయించుకొంటిని.

కాని పుస్తక విద్యయొక్క ఆవశ్యకతను కూడ నేను గ్రహించి యుండుటచేత, శ్రీ కాలెంబాఖ్, శ్రీ ప్రాగ్జీ దేశాయిగాల సహాయముతో కొన్ని తరగతులను ప్రారంభించి తిని. శరీర వ్యాయామమునకు నేను తక్కువస్థానమియ్యలేదు. నిత్య కార్యక్రమమునందే వారా లాభమునుకూడ పొందిరి. క్షేత్రమునకు ప్రత్యేక సేవకులులేరు. వండుటమొదలు పాకీ పనివరకు అన్నిపనులు క్షేత్రవాసులే చేసుకోవలసియుండెను. పెంచుటకు చాల ఫలవృక్షములుండినవి. వలసినంతతోట పని యుండెను. తోటపనిలో శ్రీ కాలెంబాఖ్‌కు అభిరుచి మెండు. ఒక ప్రభుత్వోద్యాన వనమున అతడీపనిలో కొంత అనుభవమును గడించెను. వంటపనిలేని పిన్న పెద్దలందరును కొంతసేపు తోటపని చేయవలసియుండిరి. ఈ పనిలోఎక్కువ భాగము పిల్లలపై బడెను. గోతులుత్రవ్వుట, కలపకు చెట్లు కొట్టుట, మోయుట—ఇవన్నియు పిల్లలపనులే. ఇందువల్ల వాళ్లకు సరిపడినంత వ్యాయామము ఉండెడిది. పిల్లలకు సహజముగ పనిచేయుటలో ఆనందముండెను. అందుచే వారికి మరేవిధమైన వ్యాయామమును అవసరము లేక పోయెను. కాని కొందరు, అప్పుడప్పుడు అందరును, జబ్బు మిషపై పనిఎగబెట్టువారు. ఒక్కొక్కప్పుడు వారి కొంటె

తనమును చూచీ చూడనట్లు పోనిచ్చువాడను కాని, తరుచు గట్టిగా మందలించువాడను. నా కాఠిన్యమును వారు హర్షించువారు కారు. వా రెన్నడును నన్నెదిరించినట్లు నాకుగుర్తులేదు. వారితో గట్టిగవాదించి పనిని చులకన చేయరాదని వారికి నచ్చజెప్పువాడను. కాని వారికా నమ్మకము నిలబడునది కాదు. మరుక్షణమే పనిమాని మరల ఆటకుపోవువారు. అయినను ఒకమాదిరిగా పనిసాగించితిమి. ఏది ఎట్లున్నను, వారికి మంచి దేహపుష్టి కలిగెను. క్షేత్రములో నెవరికినిజబ్బు చేయలేదని యే చెప్పవచ్చును. మంచిగాలి, నీరు, వేళపట్టున భోజనము అందుకు ముఖ్యకారణము.

వృత్తివిద్యనుగూర్చి ఒక్కమాట. ప్రతి యువకునికిని ఉపయుక్తమగు యేదోయొక చేతిపరిశ్రమ నేర్పవలెనని నా యుద్దేశము. ఇందుకుగాను శ్రీ కాలెంబాష్ ఒకట్రాపిస్టు మఠమునకు వెళ్లి చెప్పులుకుట్టుపని నేర్చుకొనివచ్చెను. ఆయనవద్ద నేనది నేర్చుకొని, యభిరుచి యున్న వారికి నేర్పితిని. శ్రీ కాలెంబాష్‌కు వడ్రపుపనిలో కొంత అనుభవముండెను. అక్కడి నివాసులలో మరొకరికిగూడ ఆపని తెలియును. కనుక వడ్రంగముతరగతి ఏర్పాటు చేసితిమి. వంటపని రమారమి అందరికిని తెలిసినదే.

ఇదంతయు వారికి క్రొత్తగానుండెను. ఏదో ఒకనాడు ఇవన్నియు తాము నేర్వవలసిన పనులని వారు కలనైన తలచి

యుండలేదు. ఎందువల్లననగా, దక్షిణాఫ్రికా భారతీయుల పిల్లలకు సాధారణముగ గరపబడువిద్య చదువుట, వ్రాయుట, గణితముమాత్రమే.

టాల్‌స్టాయి క్షేత్రములో, ఉపాధ్యాయులు చేయనిపనిని విద్యార్థులచే చేయించరాదని ఒకనియమ మేర్పరచితిమి. కనుక పిల్లలతోకలిసి పనిచేయుచు, వారికి సహకరించుచు ఎల్లవేళల ఒకఉపాధ్యాయుడుండవలసినదే. ఇందువల్లపిల్లలు పనిని జాగ్రతతో చేయువారు.

పుస్తకవిద్య కొంత కష్టతరసమస్య యయ్యెను. దానికి వలసిన సాధనసంపత్తిగాని, విద్వత్తుగాని నాకులేవు. అను కున్నంత సమయముకూడ నాకు లేకపోయెను. నేను చేయు కాయకష్టముతో సాయంకాలమునకు నాకు అలసట వచ్చెడిది. విశ్రాంతిని మానుకొని నాతరగతులను పెట్టుకొనువాడను. నిర్మలమైనమనస్సుతో క్లాసులో కూర్చుండుటకుబదులు చాల కష్టముమీద మేల్కొని కూర్చుండువాడను. ఉదయపు పూటంతయు క్షేత్రములోపనికి, ఇంటిపనికి సరిపోయెడిది. మధ్యాహ్నభోజనము తరువాతనే తరగతులకు సమయము. మరొకసమయ మందుకు కుదరలేదు

పుస్తక పాఠములకు మూడు కాల విభాగములకు మించు యిచ్చువారముకాము. హిందీ, తమిళము, గుజరాతీ, ఉర్దూ నేర్పబడునవి. బోధన వారివారి మాతృభాషల ద్వారానే

జరిగెడిది. ఇంగ్లీషుకూడ నేర్పుచుంటిమి. హిందువులగు గుజరాతీ పిల్లలకు కొంచెము సంస్కృతమును, పిల్లలందరికిని ప్రాథమిక చరిత్ర, భూగోళము, గణితము నేర్పబడుచుండెను.

తమిళము, ఉర్దూ పాఠములను నేను చెప్పుచుంటిని. నాకున్న కొద్ది తమిళజ్ఞానము సముద్రయానములలోను, జైళ్లలోను వచ్చినది. పోపు వ్రాసిన తమిళవాచకము, చాల బాగుండెను. నా తమిళజ్ఞానము దానితో సరి. నాకు తెలిసిన ఉర్దూలిపి ఒకసారి ప్రయాణములో నేర్చుకొన్నది. ముస్లిం మిత్రుల పరిచయములో నేను నేర్చిన పర్షియన్ అరబిక్ మాటలే నాకున్న ఆ భాషాజ్ఞానమంతయు. నా సంస్కృత జ్ఞానం హైస్కూలులో చదువుకొన్నదెంతో అంతే. నా గుజరాతీ భాషకూడ బడి చదువును మించలేదు.

ఈపాటి మూలధనముతో నేను పని జరుపవలసియుంటిని. పాండిత్యలోపంలో, నా సహకార్యకర్తలు నాకంటెమిన్న. కాని దేశభాషల యెడల నాకుండిన అభిమానము, నాబోధనా శక్తిలో నాకుగల ఆత్మవిశ్వాసము, నా విద్యార్థుల అజ్ఞానము, అంతకుమించి వారి యౌదార్యము నాకెంతయు అనుకూలించినవి.

తమిళ బాలురందరు దక్షిణాఫ్రికాలో జన్మించినవారు కనుక వారికివచ్చిన తమిళము చాల స్వల్పము. లిపి అసలే యెరుగరు. కనుక లిపి, వ్యాకరణసూత్రములు నేను నేర్ప

వలసియుంటిని. నాకది సులువు. తమిళ సంభాషణలో నన్నోడించగలమని వారెరుగుదురు. ఇంగ్లీషురాని తమిళులు నన్ను చూడవచ్చినపుడు నాకర్థముచెప్పు మధ్యవర్తులు వీరే. నావిద్యార్థులనుండి నా అజ్ఞానము మరుగుపరచినవాడను కాను కనుక, ఉల్లాసముతో నాపని కొనసాగినది. అన్ని విషయములందును నా నిజస్వరూపము వారి కగపడులాగున నిష్కపటముతో వర్తించువాడను. పాండిత్య విషయమున నాఅపార అజ్ఞానమెట్లున్నను, విద్యార్థుల ప్రేమ గౌరవములను నే నెన్నడును కోల్పోలేదు. ముస్లింబాలురకు ఉర్దూచెప్పుట అంతకంటెను సులభమనిపించెను. వారికి లిపి తెలియును. చదువులో అభిరుచి కలిగించి, ప్రోత్సహించుట, దస్తూరీ కుదుర్చుట నాపని.

ఈ చిన్నవాళ్లు చాలవరకు భాషను, పాఠశాలసుఖమును ఎరుగనివారు. కాని పనిలో పురోగమించినకొలది, నేనువారికి బోధించవలసినది విశేషించి కనబడలేదు. వారు సోమరులు కాకుండ చూచుచు, చదువులో శ్రద్ధ కలిగించువాడను. ఇంత మాత్రముతో నేను తృప్తి జెందుటచేత, వేరువేరు పాఠములు నేర్చుకొను వివిధ వయస్సుల బాలురను ఒకచో కూర్చుండబెట్టి పని జరుపగలుగువాడను.

పాఠపుస్తకములను గూర్చి ఏమేమో వినుచుందుము. కాని వాటి యవసరము నాకెపుడును కనబడలేదు. ఉన్న

పుస్తకములనైన విశేషముగ ఉపయోగించినట్లు నాకు జ్ఞప్తి లేదు. పుస్తకపాఠములతో విద్యార్థుల తలలను నింపే అవసరము నాకగుపించలేదు. విద్యార్థికి నిజమైన పాఠ్యగ్రంథము ఉపాధ్యాయుడేయని మొదటినుండియు నాయభిప్రాయము. నా చిన్ననాటి అధ్యాపకులు వాచకములనుండి బోధించినది నాకిపుడు జ్ఞప్తియందే లేదని చెప్పవలె. పుస్తకము లేకుండ వారు నాకు బోధించిన విషయములు నాకిప్పటికిని స్పష్టముగ జ్ఞప్తియందున్నవి.

పిల్లలు చాల విషయములను కండ్లతోకంటె చెవులద్వారా ఎక్కువగను, తక్కువ శ్రమతోను గ్రహింతురు. ఏ పుస్తకముగాని ఆదినుండి అంతమువరకు నేను బాలురతోకలిసి చదివిన జ్ఞాపకము లేదు. వివిధ గ్రంథముల పఠనము వలన నేను జీర్ణించుకొన్నదంతయు నా భాషలో వారికి తెలియజెప్పితిని. ఆ విషయము లిప్పటికిని వారి జ్ఞప్తియందుండునని ధైర్యముతో చెప్పగలను. పుస్తకములనుండి నేర్చుకొన్నది జ్ఞాపకముంచుకొనుట వారికెంతో శ్రమయయ్యెను. నేను నోటితో చెప్పినది అతిసులువుగ వారు మరల చెప్పగలుగువారు. చదువుట వారికి కష్టమయ్యెను. చదివించుటమాని విషయమును రసవంతముచేసి చెప్పినపుడు వినుట వారికి సంతోషముగానుండెను. సంభాషణలో వారు నన్నడుగు

ప్రశ్నలనుబట్టి వారికెంత గ్రహణశక్తియుండెనో నాకు బోధపడుచుండెను.

బాలుర శరీరక మానసిక శిక్షణకంటె ఆధ్యాత్మిక శిక్షణ మిగుల కష్టతరమనిపించెను. వారి యాత్మశిక్షణకుగాను మత గ్రంథములపై నే నాధారపడలేను. ప్రతివిద్యార్థియు తన మతముయొక్క మూలసూత్రములను, తన మతగ్రంథముల లోని సామాన్యజ్ఞానమును కలిగియుండుట అవసరమని నా విశ్వాసము. నాకుచేతనైనంతగ అట్టిజ్ఞానము విద్యార్థులకీయబడు యేర్పాటుచేసితిని. నాదృష్టిలో అదికూడ బుద్ధివికాస శిక్షణలో నొకభాగమే. టాల్‌స్టాయి క్షేత్రమున బిడ్డల శిక్షణ ప్రారంభించుటకు చాలపూర్వమే, ఆధ్యాత్మికశిక్షణ ఒక విశిష్ట విషయమని నాకు గోచరించెను. ఆత్మాభివృద్ధి యనగా శీలమును వృద్ధిచేసుకొనుటయనియు, బ్రహ్మజ్ఞానమునకును ఆత్మానుభూతికిని కృషి సల్పుటయనియు అర్థము. శిక్షణలో నిదియొక ముఖ్యాంగము. ఆత్మవికాసమును పురస్కరించుకొనని శిక్షణయంతయు నిరర్థకము, హానికరమనిగూడ నావిశ్వాసము.

చివరి సన్యాసాశ్రమములో మాత్రమే ఆత్మజ్ఞాన సాధన సాధ్యమని చెప్పు మూఢనమ్మిక నే నెరిగినదే. కాని ఈ యమూల్యానుభూతిని జీవితపు చివరిమెట్టుకు నెట్టివేయు వారికి లభ్యమగునది ఆత్మోపలబ్ధి కాక, జాలికరమగు రెండవ

శైశవదశయనబడు భూమికి భారమైన ముసలిబ్రతుకు. ఇది అందరెరిగిన విషయము. నేను అధ్యాపకత్వము చేయునప్పటికే (1911 - 12) నాకీ యభిప్రాయములు గట్టిగా స్థిరపడినట్లు నాకు బాగుగ గుర్తు. నేను అపుడీభావములను ఈ మాదిరి భాషలో వ్యక్తపరచి యుండకపోవచ్చును.

ఈ యధ్యాత్మిక శిక్షణ నిచ్చుటయెట్లు? ప్రార్థన గీతములను పిల్లలచే కంఠస్థముచేయించి, ఒప్పజెప్పకొంటిని. నీతి గ్రంథములనుండి ధర్మ విషయములు చదివి వినిపించువాడను. కాని అదినాకు తృప్తినీయలేదు. పిల్లలతో సన్నిహితసంబంధమేర్పడిన కొలది, ఆధ్యాత్మిక శిక్షణ పుస్తకములద్వారా జరుగదని తెలిసికొంటిని. శారీరకశిక్షణ, దేహపరిశ్రమ వలనను, మానసికశిక్షణ మనోపరిశ్రమవలనను ఈయబడునట్లే, ఆత్మశిక్షణ ఆత్మసంబంధమగు పరిశ్రమద్వారా మాత్రమే సాధ్యమగును. ఈ పరిశ్రమ అధ్యాపకుని జీవితము మీాద, శీలముమీాద ఆధారపడియుండును. అధ్యాపకుడు విద్యార్థుల మధ్యనున్నను, వేరొకచోటనున్నను, అన్నివేళల ఏకాగ్రచిత్తుడై, కర్తవ్యనిష్ఠుడై యుండవలెను.

ఉపాధ్యాయుడు మైళ్లకొలది దూరముననున్నను, తన జీవిత విధానముద్వారా విద్యార్థుల ఆత్మలపై తన ప్రభావమును చూపగలడు. నేను అనృతములు పలుకుచు, సత్యము పలుకవలెనని బాలురకు బోధించుట నిరర్థకము.

పిరికివాడగు ఉపాధ్యాయుడు విద్యార్థులను ధీరులుగ నెన్నడును చేయలేడు. తా నింద్రియలోలుడై, ఇంద్రియ నిగ్రహ ప్రాశస్త్యమును శిష్యులకు బోధించలేడు. కనుక నావద్ద నున్న బాలబాలికలకు నేను నిరంతర దృష్టాంతముగనుండి తీరవలెనని తెలిసికొన్నాను. ఇట్లు వారే నాకు ఉపాధ్యాయులైరి. కేవలము వారికోసమైనను నేను మంచివాడను, ఋజువర్తనుడను కావలెనని గుర్తించితిని. టాల్‌స్టాయి క్షేత్రములో నాపై నేను అధికాధికముగ విధించుకొన్న క్రమశిక్షణకును, నిగ్రహమునకును నాపోషణలోనుండిన ఈ బాలబాలికలే చాలవరకు కారకులు.

అందొకడు అసాధ్యుడు. మాటవినడు. అబద్ధాలకోరు, కజ్జాకోరు ఒకనాడతడు దౌర్జన్యముతో రెచ్చిపోయెను. నాకు చాల కోపమువచ్చెను. నావిద్యార్థుల నెపుడును నేను దండించలేదు. కాని ఈసారి నాకెక్కువకోపము వచ్చెను. వానితో వాదింప ప్రయత్నించితిని. కాని వాడుచలించలేదు. వానిస్థితి శృతిమించిపోయెను. చివరకు రూళ్లకర్రతో వాని చేతిపై నొకదెబ్బవేసితిని దెబ్బవేసి నేను వణకిపోతిని. నాస్థితి వాడు కనిపెట్టినాడు. అది యందరకు అత్యాశ్చర్యకర దృశ్యమాయెను. కుర్రవాడేడ్చుచు క్షమించమని ప్రార్థించెను. చేతి నొప్పివలనకాదు వాడేడ్చినది వాడు తలచుకొన్నచో అదే శాస్తి నాకును చేసియుండగలడు — శరీరపుష్టిగల

పదిహేడేండ్లవాడు. ఇంత దౌర్జన్యమునకు పాల్పడుచు నేను పొందిన బాధను వాడు గ్రహించెను. అటుపైన వాడెన్నడును అవిధేయత చూపలేదు. కాని నా దౌర్జన్యము నన్నిప్పటికిని బాధించుచునేయున్నది. ఆత్మశక్తినిగాక, నా పశుత్వమునే నే నా నాడు ప్రదర్శించితిని.

దెబ్బలశిక్షకు నే నెప్పుడును వ్యతిరేకినే. నా కుమారులలో ఒకనిని ఒక్కసారే దెబ్బకొట్టినట్లు నాకు జ్ఞాపకము. కనుక ఆనాడు మాళ్లకర్రతో నే జేసినపని రైటో తప్పో నాకు తేలలేదు. కోపముతోను, దండించవలెనను కోరికతోను జరిగియుండుటవలన అదితప్పే అయియుండును. నాదుఃఖమును వ్యక్తపరచుటకు చేసినపని యైనచో, అదిసమంజసమనుకొని యుండును. కాని ఈ సందర్భములో నా యుద్దేశము మిశ్రితమైయుండెను.

ఈ సంఘటన నాలో జిజ్ఞాసను రగుల్కొల్పెను. విద్యార్థులను సరిదిద్దుటలో ఇంతకుమించిన మంచి మార్గమును నాకది కనబరచెను. ఆమార్గమీసంఘటనలో ఉపకరించి యుండునో లేదో చెప్పజాలను. నాడు జరిగిన విషయమునే ఆపిల్లవాడు మరచిపోయెను. వాడు తన నడవడినంతగా బాగుపరచు కొన్నట్లు నాకగపడలేదు. అయినను అధ్యాపకుడు విద్యార్థుల యెడల తన బాధ్యతను బాగుగ గ్రహించుటకు నాకీసంఘటన పనికివచ్చినది.

తరువాతకూడ విద్యార్థుల దుష్టప్రవర్తన కనబడుచు వచ్చినను నే నెవ్వరిని దెబ్బవేసి యుండలేదు. ఇట్లు నా సంరక్షణలోనుండిన బాల బాలికలకు ఆధ్యాత్మిక శిక్షణ నిచ్చు యత్నముద్వారా ఆత్మశక్తియొక్క ప్రభావమును నే నంతకంతకు బోధపరచుకో గలిగితిని.

బాలబాలికలను ఋజుమార్గమున పెంచి విద్యగరపుట ఎంతకష్టమో. ఆరోజు కారోజు నాకు స్పష్టమయ్యెను. వారికి నిజమైన బోధకుడను, పోషకుడను కావలెనన్నచో, నేను వారి హృదయములను తట్టి. వారి సుఖదుఃఖములలో భాగ స్వామినిగావలె. వారినెదుర్కొను సమస్యలను తీర్చుటలో సహకారినిగావలె. యువకులలో పొంగిపొరలు ఉన్నత ఆకాంక్షలను మంచిదారికి మరల్చి నడిపించవలె.

ఒక్కొక్కప్పుడు విద్యార్థుల దుర్నడతను సరిదిద్దుటలో ఉపాధ్యాయుని ఉపవాసముగూడ బలీయమగు చికిత్సయని నా యభిప్రాయము. కాని దానికి మూలమున సుస్పష్టమగు దృష్టి, ఆధ్యాత్మికయోగ్యత ఉండవలెను. గురుశిష్యులమధ్య నిజమగు ప్రేమలేనిచోట, విద్యార్థిలోని దోషము ఉపాధ్యాయుని హృదయాంతరాళమును తాకనప్పుడు. శిష్యునికి ఆచార్యునియెడల భక్తిగౌరవములు లేనిచోట, ఉపవాసము నకు స్థానము లేకపోవుటేగాక, అది హానికరముకూడ కాగలదు. అట్టిచోట్ల ఉపవాసముయొక్క ఉపయోగము

సందేహాస్పదమైనను, శిష్యుని తప్పుడు నడతపట్ల అధ్యాపకునికి గురుతరబాధ్యత యున్నదనుట నిర్వివాదము.
ఆత్మకథ : (1926.) పుటలు 407 - 15, 418, 419.

# 5

## జాతీయ పాఠశాలలలో

### జాతీయ పాఠశాలలు

జాతీయ పాఠశాలపేరు సార్థకము కావలెనన్నచో, విద్యాసంస్థలకు వర్తించినంతవరకు, జాతీయోద్యమ కార్యక్రమమును కొనసాగించు దృష్టితోనే అవి నడుపబడవలసి యున్నవి. స్వరాజ్య సంపాదనము కొరకే అవి స్థాపింపబడి యున్నవి. ఒక దృష్టాంతము : రాట్న సందేశమును వ్యాపింపజేయుటలో ఈ పాఠశాలలు బలవత్తమములైన సాధనములు కావలెను. విద్యాలయమును హిందూ, ముసల్మాన్, క్రైస్తవాదుల సఖ్యతను సమకూర్చునవి, 'అస్పృశ్యుల'కు విద్యగరపి అస్పృశ్యతా పిశాచమును పారదోలునవి కావలెను. పై కొలతనుబట్టి చూచినచో మన ప్రయోగము విజయవంతము కాలేదని చెప్పకతప్పదు. ముప్పదివేల బాలబాలికల సంఖ్యలో వేయిమందియైనను వందరాట్నాలపై అరగంటసేపు నూలుతీయుటలేదు. వంద

లాది రాట్నములు పనిలేక, దిక్కు లేక పడియున్నవి. పాఠశాలలలో 'అంటరాని' వారికిగూడ ప్రవేశమున్నదనుట వట్టి సిద్ధాంతముగ నున్న దేశాని, బహుకొద్ది పాఠశాలలలో మాత్రమే వారి పిల్లలుంటున్నారు. ముసల్మాన్ పిల్లలుకూడ చాల తక్కువ. కనుక ప్రాధాన్యత నియ్యవలసినది పాఠశాలలలోని మొత్తము బాలురసంఖ్యకు కాదు; అందున్న విద్యావిధానములోని విశిష్టతకు. విద్యార్థుల ప్రవేశార్హతలను గూర్చి క్రమశః కఠిన నియమములుండవలెను. తమబిడ్డలు నూలువడుకుటకును, 'అస్పృశ్యుల' తో కలిసి కూర్చుండుటకును, ఇష్టపడని తల్లిదండ్రులు వారిని బడినుండి తీసికొని పోవచ్చును. 'అస్పృశ్యుల' ను, రాట్నమును పాఠశాలలలో నిషేధించవలసి యున్నచో, ఉపాధ్యాయులట్టి పాఠశాలలను ఎత్తివేయవచ్చునని నాఖండితమగు సలహా. రహస్యముగ పాఠశాలలో ప్రవేశించు 'అస్పృశ్యుల' ను సహించుట చాలదు. శ్రద్ధతోను, ప్రేమతోను వారిని మనపాఠశాలలలోనికి తెలిసి రప్పించుకోవలెను. ముస్లిం, పార్శీతల్లిదండ్రులు తమబిడ్డలను పంపువరకు మనము వేచియుండరాదు. పంపుడని మనమే వారిని కోరవలెను. జాతీయ విద్యాలయాధ్యాపకుడు తన ఆవరణలో స్వరాజ్య ప్రచారకుడు కావలెను. అతనికి బడిపిల్లలతో, బడిలోఏర్పడు పరిచయము చాలదు. తన కప్పజెప్పబడు ప్రతిబిడ్డయొక్క చరిత్రను అతడెరిగి యుండ

వలెను. బిడ్డల తల్లిదండ్రులతో అతనికి పరిచయముండవలెను. బిడ్డలు బడికెందుకు వచ్చుటలేదో తెలిసికొనుచుండవలెను. అసహనముతోగాక, ప్రేమతో అతడీపని చేయవలెను. అప్పుడుమాత్రమే ఈ పాఠశాలలు కాంగ్రెసు తీర్మానము ప్రకారము నిజముగ జాతీయములగును.

ఇది కష్టముతోగూడిన పనియనుటకు సందేహములేదు. ప్రభుత్వము ప్రతిపనిని ధనాపేక్షతో కూర్చి యుంచినది. దేనికిని శీలమును, యోగ్యతను పరీక్షగా పెట్టి యుండలేదు. నిస్సారమగు పాఠ్యక్రమమును గుడ్డిగాఅనుసరించు నిర్జీవపద్ధతి నేటివిద్యకు ఒకేఒకగుర్తుగానున్నది. ప్రతివృత్తియు లాభసాటి వ్యాపారముగ ఎంచబడు హీనస్థితికి వచ్చినది. మనము లాయర్లము, డాక్టర్లము, ఉపాధ్యాయులముఅగుట డబ్బు సంపాదనకేగాని దేశజనుల సేవచేయుటకుకాదు. ఇట్టిఆత్మ వినాశకరమగు పరిస్థితిలో ఈ విద్యాపీఠము* అర్హులగు ఉపాధ్యాయుల కొరకు వెదకుకొనవలసి యున్నది. అధ్యాపకులలో చాలమంది తమ చిత్తవృత్తులను, పరిసర స్థితుగతులను అతీతించి పైకి లేవవలసియున్నారు. దేశము యొక్క పిలుపునిని వారు బయటికి వచ్చియుండుటే ఆశ్చర్య కర విషయము.

అయితే ఇప్పుడు రమారమి ఈ నాలుగేండ్ల అనుభవ

* గుజరాతు జాతీయ విశ్వవిద్యాలయము, అహమ్మదాబాదు

ఫలితముగ మనమొక క్రొత్త అధ్యాయమును ప్రారంభించ వలసియున్నాము మనమొకచో స్తబ్ధులమై నిలిచిపోతే, మునిగిపోదుము. కనుక బాల బాలికలు దినానికి కనీసము అరగంటసేపు రాట్నముతో పనిచేయవలెనను నియమముండ వలెను. ఇట్లు ముప్పదివేల మంది బాల బాలికలు. ఎనిమిది వందలమంది అధ్యాపకులు దినమున కరగంటసేపు దేశము కొరకు పాటుపడుటయే యోగ్యమగు విద్య. దేశభక్తి, యుప యుక్తమగు కాయకష్టము. దానము—ఇన్నిటి కది దృష్టాంత పూర్వకమైన దినపాఠము కాగలదు. ప్రతిఫలాపేక్ష లేని దాన గుణము విద్యార్థిదశలో ప్రారంభమగుట స్వార్థత్యాగములో మంచి గుణపాఠము కాగలదు. దాని నతడు జీవితములో నెప్పుడును మరచిపోడు. అనగా, భారతప్రజకు నెలకు 1875 గుణుగుల వడుకు నూలు దానమిచ్చుటయని అర్థము. ఒక్కొ క్కని కొక ధోవతిచొప్పున 500 మంది కీయవచ్చును. మిగత విషయముల నటుండనిండు. ఒక్కొకబడి పిల్లవాడు మరి యైదుగురతో కలసి ఒక నెలలోవడికిన నూలుతో తోడిదేశీయు లగు మద్రాసు వరదబాధితులలో ఒక్కొకని కొక ధోవతి చెప్పున ఇయ్యగలడను పాఠము ఒంటబట్టినచో, దానివిలువ యెట్టిదో ప్రతి యుపాధ్యాయుడును గమనింపదగినది.

యంగ్ ఇండియా. 7-1-'24.

జాతీయవిద్యను స్వరాజ్యస్థాపన దృష్టితోమాత్రమే నేను

చూడగలను. కనుక కాలేజీ విద్యార్థులును, అధ్యాపకులును గూడ నూలుపరిశ్రమలో సిద్ధహస్తులు కావలెనని నాకోరిక. ఖద్దరుయొక్క అంతరార్థమును, ఆర్థికతత్వమును శ్రద్ధతో పరిశీలించమని వారిని కోరుదును. ఒకమిల్లుస్థాపన కెంత కాలముపట్టునో, ఎంత పెట్టుబడి కావలెనో వారు తెలిసికో వలెను. మిల్లులసంఖ్య మితిమీరుటలోగల యిబ్బందులను వారు గుర్తించవలెను. దేశసంపద ప్రజలలో మిల్లులద్వారా ఎట్లు పంపకమగునో, చేనూలు, చేనేతలద్వారా ఎట్లు పంపక మగునో వారు తెలిసికోవలె. ఇండియాలో నూలుపరిశ్రమ, బట్టలనేత ఎట్లు ధ్వంసముచేయబడెనో గమనింపవలె. భారత కృషీవలుల లక్షలాది కుటీరములలో రాట్నపరిశ్రమ తిరిగి నెలకొనుటవల్ల కలుగుఫలితాలను వీరు ప్రత్యక్షముగ ఋజువు చేయగలిగి యుండవలె. ఈ పరిశ్రమయొక్క సంపూర్ణ పున రుద్ధరణ విచ్ఛిన్నములైన హిందూ ముసల్మాను హృదయము లను మరల ఎట్లు కలిపివేయగలదో తెలిసికొనవలె.

యంగ్ ఇండియా, 11-12-'24.

## నూలువడుకుట, విజ్ఞానశాస్త్రములు

మన విద్యాలయములు కేవలము వడుకు, నేత కేంద్రములు కావలెనని నే ననను. వడుకు, నేతను ఏ జాతీయ విద్యావిధా నములోగాని తప్పనిసరిభాగమని నే ననను. పిల్లల సమయ

మంతయు ఇందుకే ఖర్చుపెట్టుట నాయుద్దేశముకాదు. చతురుడగు వైద్యుడుపాడైన అవయవమునకు ముఖ్యముగ ముందు చికిత్సచేయుట ద్వారా మిగత అవయవములను కాపాడును కదా! నాపనియు అట్టిదే. బిడ్డయొక్క చేతులను, మనస్సును, ఆత్మను నేను వృద్ధిపరచుదును. మనచేతులు చాలవరకు చచ్చుపడినవి. ఆత్మ పూర్తిగ వదలివేయబడినది. కనుకనే మన విద్యావిధానములోని ఈ దారుణదోషాలను సవరించమని అయినపుడు కానపుడుకూడ నేను హెచ్చరించుచుందును. దినమున కరగంటసేపు నూలువడుకుట మనపిల్లలకు బాధకరమా ? దానితో మనస్సు మొద్దుపారునా ?

వివిధ విజ్ఞానశాస్త్రముల అధ్యయనమునకుకూడా నేను ప్రాధాన్యతనిత్తును. మనబిడ్డలకు పదార్థవిజ్ఞానము, రసాయనికజ్ఞానము ఎంతయున్నను ఉండదగినదే. నాకు నేరుగ సంబంధమున్న విద్యాసంస్థలలో విజ్ఞానశాస్త్రపాఠములు కొరవడియున్నవంటే, సమర్థులగు అధ్యాపకులు లేకపోవుటయే కారణము. ఇందుకుగాను ఖర్చుతోగూడిన ప్రయోగశాల లుండవలెను. అవిలేనికారణ మొకటున్నది. ఈ సందిగ్ధ శైశవ దశలో ఇంతఖర్చుచేయగల స్థితి మాకులేదు.

యంగ్ ఇండియా, 12-3-'25

## బడులలో నూలువడుకుట

నూలుపరిశ్రమను పునరుద్ధరించుట విధాయకమైనచో గట్టి

శ్రద్ధ అవసరము. బాగుగనడుపబడు పాఠశాలలలో మిగత పాఠములవలెనే ఈ పనిగూడ శాస్త్రదృష్టితో నేర్పబడవలెను. రాట్నములన్నియు మంచిస్థితిలో నుంచబడి, ఈ పత్రికా ముఖమున అప్పుడపుడు సూచింపబడు పరీక్షలకు అవి నిలువవలె. మిగత పాఠములలోవలెనే ఇందుగూడ విద్యార్థులు రోజురోజూ చేయుపని శ్రద్ధతో పరిశీలింపబడవలె.

ఇష్టముంటె, విద్యార్థులిండ్లవద్దకూడ వడుకుటకు రాట్నము ఉపయోగపడును. బడిలో వాడకమునకు తకిలీయే పొదుపైనది, లాభదాయకము.

యంగ్ ఇండియా, 15-10-'25.

## జాతీయవిద్య × ప్రభుత్వమిచ్చువిద్య

మనవిద్యార్థులలో నొకడు బార్డోలీ జైలుకు వెళ్లినాడు. ఇంకను చాలమంది వెళ్లగలరు. విద్యాపీఠము గర్వించదగిన విషయమిది. ప్రభుత్వ సంస్థలలోని విద్యార్థులకుగూడ ఇట్టి కోరికయున్నను, ధైర్యముండునా? బార్డోలీవెళ్లి వల్లభభాయికి తోడ్పడు అవకాశము మీకున్నట్లు వారికిలేదు. రహస్య సానుభూతిమాత్రమే వారికున్నది. జాతీయజీవన మింత గడ్డు స్థితిలోనుండగా, మనలను బంధించి నొక్కివేయు ఈ పుస్తకవిద్య ఎందుకు? ఎండి నశించిపోవుచున్నవానికి అక్షరజ్ఞానము నిరర్థకము.

ఇక మన బోధనాపద్ధతికిని, ప్రభుత్వపద్ధతికిని ఎంతో వ్యత్యాసమున్నది. ఒకవిషయము తీసికొందము. ఆంగ్లభాషను వారునేర్పుపద్ధతిలో మనము నేర్పము. అవసరమైనంత సామాన్య జ్ఞానమును మాత్రమిత్తుము. కాని మాతృభాషను మూలబెట్టి, ఇంగ్లీషునే మాట్లాడుచు, వ్రాయుచు, జాతిని ఆత్మహత్యపాలు చేయము. అట్టి విషతుల్యమగు ఆచారమును సరిదిద్దుటే మన మీ సంస్థలో చేయుయత్నము. పాఠము లన్నియు గుజరాతీ భాషలోనే మనమునేర్వవలె. మాతృ భాషను పుష్టివంతముచేసి, మన సమస్త భావములను, అను భవములను తద్వారానే వ్యక్తపరచవలె.

తరువాత, ఆర్థికశాస్త్రమును తీసికొనుడు. ఇప్పటి సర్కారు సంస్థల అర్థశాస్త్ర బోధపాపభూయిష్టమైనది. ఒక్కొక దేశమున కొక్కొక అర్థశాస్త్రముండును. ఇందు జర్మను పాఠ్యగ్రంథములు, ఆంగ్లగ్రంథములు వేరువేరు. స్వేచ్ఛావ్యాపారము ఇంగ్లాండుకు ముక్తిప్రదము కావచ్చును. మనకవి వినాశహేతువు. భారతదేశమునకు తగిన ఆర్థికవిధాన మింకను నిర్మాణము కావలసియున్నది.

చరిత్ర విషయముకూడ ఇంతే. ఫ్రాన్సుదేశీయుడు హిందూదేశ చరిత్రను తన స్వంతపద్ధతిని వ్రాయును. ఆంగ్లేయుడు దానినే మరొకవిధముగ వ్రాయును. ఆంగ్లేయు లకును ఫ్రెంచివారికిని మధ్యజరిగిన యుద్ధముల వర్ణన గ్రంథ

కర్తనుబట్టి భేదించును. భారత దేశారాధకుడు మూలాధారములతో వ్రాసిన ఇండియా చరిత్రకును ఆంగ్లాధికార వర్గమువాడు వ్రాసిన దానికిని భేదముండును. ఎవరికి వారు న్యాయదృష్టితో వ్రాసినను, ఈ భేదములు తప్పవు. మనజాతీయ చరిత్రాంశములకు ఆంగ్లేయులిచ్చిన విలువలను మనము స్వీకరించియుండుటలోనే చాల తప్పుపని చేసితిమి. కనుక ఈ విషయములలో స్వతంత్రమగు పరిశోధనలకు మీకును మీ అధ్యాపకులకును విశాలమైన అవకాశమున్నది.

గణితమువంటి పాఠమును చెప్పుటలోగూడ మనపద్ధతి వేరు. మన గణితోపాధ్యాయుడు ఇండియా స్థితిగతులకుతగిన ఉదాహరణలు తీసికొనును. గణిత బోధనతోపాటు ఇండియా భూగోళమునుకూడ అతడు బోధించవలసి యుండును.

చేతిపనులకుగూడ మనము ప్రత్యేక ప్రాముఖ్యమిచ్చుచున్నాము. ఈ శిక్షణ విద్యార్థులబుద్ధిని మందగింపజేయుననుకొనుట పొరపాటు. కంఠస్థముచేసి విషయములతో మెదడును నింపుటవలన, జ్ఞానకవాటము తెరువబడదు. కుశాగ్రబుద్ధితో పొందిన పారిశ్రామికశిక్షణ అశ్రద్ధతో చేయబడు సారస్వతపఠనముకంటె మెదడుకెక్కువ సహాయకారి యగును.

యంగ్ ఇండియా, 21-6-28.

మూడవ భాగము

# నూతన విద్య

## 6

## నూతనవిద్య ప్రజాసంస్కృతిలోను, వారి జీవితములోను పాదుకొనవలెను

### జాతీయ విద్య

విద్యనుగూర్చి నేటి విద్యావేత్తల భావములు, వారి ప్రణాళికలు ఆక్సుఫర్డు, కేంబ్రిడ్జి, ఎడింబరో, లండనులనుండి వచ్చిన దిగుమతిసరుకు. అది ముఖ్యముగ విదేశసాంప్రదాయికమగుటచే మనము దానిని వదలివేయునంతవరకు జాతీయవిద్య కేమాత్రమును దారిదొరకదు. పాశ్చాత్య విద్యను వదలుకొనుట ఇండియాకు సాధ్యమగునా యను సమస్యను మనమిపుడు చర్చించుటలేదు. (ఐరోపా విధానము యొక్క విశిష్టరూపమే ఆంగ్లవిధానమని నేనందును) యంత్ర పరిశ్రమలు, ధనికతత్వము, సైన్యము మొదలగు ఐరోపా ఆయుధాలతోనే ఐరోపాను ఎదుర్కొనుటకు ఇండియా నిశ్చయించుకొని, తనబిడ్డలను చెల్లుబడికాని కృత్రిమ యూరోపి

యనులుగను, సైనికులుగను, మారణాస్త్ర నిర్మాతలుగను, విజ్ఞానశాస్త్ర వ్యభిచారులుగను, దైవమును మరచినవారుగను తయారుచేసికొన్నచో, రాగల విపత్తును లక్ష్యపెట్టక, తెగించి, పై మార్గమును బట్టవలసినదే. జాతీయవిద్యద్వారా పై పనులు నెరవేరవు కనుక జాతీయవిద్యనుకూడ వదలుకొనవలసినదే. అయితే, ఇండియా తన అదృష్టమువల్ల విశాలమగు తనపురాతన సంస్కృతితోపాటు ఒకప్పుడొక విశిష్ట విద్యావిధానమును నిర్మించుకొనగలిగెను. ఈ విధానమొక్కటే నిజముగ జాతీయ మనదగినది. ఆ ప్రాచీనపద్ధతి వేరు, ఇప్పటి ఆంగ్లో - ఇండియను పద్ధతి, దాని తద్భవమగు కృత్రిమజాతీయ పద్ధతివేరు, రెంటికిని మూలములోనే వ్యత్యాసమున్నది. ప్రస్తుతవిషయ మిది: జాతీయవిద్య - విజాతీయవిద్య, అసలు - నకలు, సాధ్యము - సాధనము, వీనిలో మనమేదో ఒకదానిని అసందిగ్ధముగను, స్థిరముగను ఎన్నుకోవలసియుంటిమి. ఇంతవరకాపని జరుగలేదు. దాని యవసరముగూడ మనకింతవరకు తట్టలేదు. ఈ విషయమున అస్పష్టతయున్నంతకాలము జాతీయవిద్య వృద్ధిచెందదు. దానికి కారణమిదే: ప్రభుత్వమిదివరకే ఒకమాదిరివిద్య నేర్పుచున్నది. దానితో ఏ యనధికార సంస్థగాని పోటీచేయుట అసంభవము. అధికారసంస్థ పెద్దది. దాని కెక్కువడబ్బున్నది. అది ఎక్కువలాభములను చూపును. సిద్ధాంతమునుగూర్చి పర్యాలోచనగాని, ఒక

నిశ్చయంగాని లేనంతవరకు మూలమునందున్న వైపరీత్య మెప్పుడును నిలిచేయుంటుంది. జాగ్రత్తగ మనమొక నిర్ణయమునకు వచ్చి, మనము నేడ్పువిద్య నిజముగ జాతీయమని, సర్కారు విద్యయొక్క నీచానుకరణము కాదని ప్రజలకు నచ్చచెప్ప గలిగినచో వారు తప్పక మనమాటవిందురు. ప్రస్తుతవిధానము వల్ల బాధపడుచున్నవారు. హానిమూలమున సంఘవిచ్ఛేదము, పిల్లలుపాడగుట జరుగునని విచారించువారు; ఈ రక్షణ మార్గము దొరికినదికదాయని మనల నభినందింతురు. జాతిని సంఘమును ఉద్ధరించి స్థిరమైన పునాదులపై నిలుపుటకు విప్లవ మెప్పటికైనను తప్పదు. అట్టి విప్లవమునకు నడుముకట్టి నిలబడు సంస్థలమీదనే భవిష్యత్ సాంఘికవ్యవస్థా నిర్మాణము ఆధారపడును.

జ్ఞప్తియందుంచుకోవలసిన విషయమిది : ప్రస్తుతవిద్యా పద్ధతి మనజీవిత స్థిరత్వమును విచ్ఛిన్నముచేసి, మరెన్నో దోషములకు కారణమైనది. ఒక తరమువారు తమ పెద్దల నుండి సంక్రమించిన బాధ్యతలను తాము వహించుచు, సంఘసాంప్రదాయములు చెడిపోకుండ చూడవలసియున్నారు. ఈ బాధ్యతకు మనుష్యులను తయారుచేయుటయే ఉత్తమ విద్యావిధానము యొక్క లక్ష్యము. సంఘజీవితమునకుండు బాధ్యత తెంపులేనిది. తన పూర్వ సాంప్రదాయమునకు పూర్తిగ దూరమై, తన పూర్వ సంస్కృతికి లజ్జనొందు సం

సంఘము నశించక తప్పదు. ఉన్నతమైన భక్తి విశ్వాసముల పరంపరయే సంఘవ్యవస్థను కట్టుదిట్టముగ నిలుపగల శక్తి— మతము యెడల భక్తి, వృత్తి యెడల, తల్లిదండ్రుల యెడల, కుటుంబము యెడల, ధర్మము యెడల భక్తి, ప్రాచీన భారత విద్యాపద్ధతి జాతిగౌరవమును, సనాతన సేవాధర్మమును, వివిధ సాంఘిక రాజ్యాంగ సాంప్రదాయములను రక్షించిన దనుట వాస్తవము. ఈ నాటి విదేశీయ సంకరవిద్య యువ జనులను ఏ మంచి పనికిని అసమర్థులుగ జేసినదనుటయు వాస్తవమే. తమ బిడ్డలను ఆంగ్ల పాఠశాలలకు పంపువారిలో పలువురు వ్యవసాయదారులు. వారు గాఢమగు భగవ ద్విశ్వాసము గల స్త్రీ పురుషులు, చదువు పూర్తి చేసికొని బిడ్డలు తిరిగి యింటికి వచ్చేసరికి వ్యవసాయమును గూర్చి వారికొక్క విషయముకూడ తెలియదు. తమ తండ్రులవృత్తి యెడల వారికి పరమ అసహ్యత. దైవభక్తిని, దైవ సంక ల్పములను అతీతించిన పై మెట్టులో తాము న్నట్లు మాట్లాడ నేర్చుకొందురు. ప్రభుత్వమున కవసరమైన కొలదిమంది గుమాస్తాలను, డిప్యూటీలను తయారు చేసికొనుట కేర్పడిన విద్యావిధానమే యైనను. ఇది వినాశకరమగు సంఘ విచ్ఛే దమునకు దారితీసినది. 'సంస్కరణల' మీద 'సంస్కరణలు' వచ్చినవి. ఉన్నతవిద్యను పరిశీలించుటకు కమిషను లేర్పడినవి. ప్రాథమికవిద్యను నిర్బంధము చేయవలె ననిరి. కాని ఈవిద్య

జాతిజీవనము యొక్క పునాదులనే కదల్చివేయు చున్నదని, ఇది మహానర్ధకమైనదని రవంత ఆలోచన ఎవరికిని తట్టలేదు. ఈ విధానము తుత్తునియలు చేయబడవలెను. నేటిఇండియా విశ్వవిద్యాలయము లేర్పడక పూర్వము, దేశ విద్యావిషయమున మెకాలే ప్రభువు ప్రాణాంతకమైన అధికారపత్రము వ్రాయకముందు, భారత విద్యా మూలసూత్రము లెట్లు అమలు జరుగుచుండెనో త్వరలో పరిశీలింపబడవలెను. ప్రాచీనవిద్యాపీఠములలోని శోధనాపద్ధతులు ఇప్పటికే చాల వరకు అంతరించిపోయినవి. కనుక త్వరితమగు చర్య అవసరము. అప్పటి పద్ధతులను పునరుజ్జీవింప జేయుటతో రాజ్యాంగ చరిత్ర, భూగోళము అదృశ్యమై పోవచ్చును. అందుకు మనమెంతమాత్రము భయపడరాదు. ఆ ప్రాచీన సూత్రములను బయటికి తీయవలెనని మనమిక్కడ చేయు యత్నము. యూరోపియనులు మనకీయుగల ఎంత సరిక్రొత్త విధానముకంటెను గూడ మన ప్రాచీనవిధానము అనంతకోటి రెట్లు మనకు ఫలదాయకమని ఘంటాపధముగ చెప్పగలము. నా యీ యభిప్రాయము పండితాభిప్రాయము కాదేమో. కనుకనే ఈ విషయము ప్రవీణులచే పరిశీలింప బడవలెనని కోరుచున్నాను. ఆ పని జరిగి, దాని ఫలితములు మనకు విస్పష్టములైనపుడు దేశప్రజలు అత్యంత కృతజ్ఞు లగుదురు.

యంగ్ ఇండియా, 20-8-24

ప్రారంభదశనుండియు, ఈ నాటి పాఠపుస్తకములకు బాలబాలికల గృహ జీవనముతో సంబంధమే లేదు. వారికేమియు పరిచయము లేని అన్యవిషయములే ఆపుస్తకములలో నుండును. గృహ జీవితములోని ఉచితానుచితములను బాలుడు పాఠపుస్తకాలద్వారా గ్రహించలేడు. తన పరిసరములను గూర్చి విద్యార్థి గర్వింపగల విద్య వాని కీయబడదు. పైతరగతులకు వెళ్ళినకొలది వాడు తన గృహమునకు దూరమై పోవును. చదువు పూర్తి యగుసరికి వానికి తన పరిసరములతో సంబంధమే యుండదు. గృహజీవనములో వానికి సుఖసౌందర్యములు కానరావు. తన ప్రాచీన దేశ సంస్కృతి శక్తి రహితము, అనాగరికము, మూఢనమ్మక, నిత్యజీవితమునకేమాత్రము కొరగానిది యని వానికి తోచును. ప్రాచీన సంస్కృతినుండి, సాంప్రదాయమునుండి విద్యార్థిని విడదీయుటయే ఈ విద్యయొక్క పని. విద్యనేర్చిన యువకులు పూర్తిగ జాతివిహీనులు కాలేదన్నచో, ప్రాచీనసంస్కృతి సంఘ హృదయమున చాల లోతుగ పాతుకొనియుండుటయే కారణము. ఇంతవిరుద్ధ విద్యావిధానము కూడ దానిని పూర్తిగ నిర్మూలించలేక పోయినది. నాకధికార మున్నచో ఈ పాఠపుస్తకములను చాలభాగము దగ్ధముచేయుదును. గృహజీవితముతో సంబంధముగల వానిని తయారు చేయింతును. తత్ఫలితముగ విద్యార్థులు తమ సన్నిహిత పరిసరములతో సంబంధము కలిగియుండ గలరు.

యంగ్ ఇండియా, 1 - 9 - 21

## పరిసరములతో సంబంధము లేదు

ఈ విద్యావిధానము నందు పిల్లలకు పరిసరములతో సంబంధము లేకుండబోవుట దురదృష్టము. అసలు చదువు కొను బాలబాలికలే అత్యల్ప సంఖ్యాకులు. వారి కీయబడు విద్య పరిసరములను తాకనే తాకదు.

హరిజన్, 23.5.36.

సదుద్దేశములతో నైనను, మనఆంగ్లగురువులు ఆంగ్లేయ, భారతీయ అవసరములలోని భేదమును బోధపరచుకొనలేక పోయిరి. వారి కవసరములగు భవనములు మన శీతోష్ణస్థితికి అక్కర లేదు. పట్టణ వాతావరణములోని అంగ్లేయబిడ్డల విద్యాపద్ధతి గ్రామ పరిసరములలో పెరిగిన మనపిల్లలకు అవ సర ముండదు.

మనబిడ్డలకు పాఠశాలలో కావలసినవి పలక, పెన్సిలు, పుస్తకములు కావు. స్వేచ్ఛతోను ఉపయుక్తముగను ఉప యోగించుకోగల సామాన్యగ్రామ పనిముట్లు వారికవసరము. విద్యాపద్ధతులలో ఒక విప్లవమిది. బడికివెళ్లదగిన ప్రతిపిల్ల వానికిని నిజమైన విద్య నీయగలిగినది ఈ విప్లవమే,

ప్రభుత్వపాఠశాలలలో జ్ఞానమనబడు చదువుట, వ్రాయుట, గణితము, విద్యార్థి పెద్దవాడైనపుడు అతని కుపయోగించుట లేదు. అభ్యాసము తప్పుటవల్లనైనను, సంవత్సరము లోపలనే

పిల్లలు వాటిని చాలవరకు మరచిపోదురు. గ్రామవాతావరణమున కవి పనిచేయవు.

కాని ఆయాపరిసరములకు తగినవృత్తివిద్య బిడ్డలకీయబడినచో, పాఠశాల ఖర్చుపెట్టు డబ్బును బిడ్డలు పనిచేసి. మరల రాబట్టుదురు. అంతేకాదు. తాముపొందినశిక్షణ జీవితము పొడుగునను వారి కుపకరించును. ఉదాహరణ: పాఠశాలకొక ప్రత్తిచేను, పడుకుపరిశ్రమ, నేత ఉన్నచో, సంస్థ పూర్తిగ స్వయంపోషకము కాగలదని నా నమ్మకము.

నేను సూచించుచున్న ప్రణాళిక పుస్తకపఠనమును నిషేధించదు. చదువు, వ్రాత, గణితములేని ప్రాథమికవిద్యాబోధ సంపూర్ణమనబడదు. బాలబాలికలకు సరిగా అక్షరములు నేర్చుకొనుయోగ్యత కలిగినపుడు చదువు. వ్రాత చివర వచ్చును. దస్తూరీ ఒకకళ. చిత్రకారుడు బొమ్మలనువ్రాయు శ్రద్ధతో ప్రతిఅక్షరము సరిగా వ్రాయవలెను. బాలబాలికలు మొదట సామాన్య చిత్రలేఖనము నేర్చుకొనుటతో దస్తూరీకూడ చక్కబడును. వృత్తివిద్య స్కూలు సమయములో చాల భాగము ఆక్రమించును. వృత్తివిద్యతోపాటు ప్రాథమిక చరిత్ర, భూగోళము, గణితముకూడ నోటితో బోధింపబడును. విద్యార్థులు మంచినడవడి నలవరచుకొందురు. పారిశుధ్యమును, ఆరోగ్యమునుగూర్చి దృష్టాంతపూర్వకములగు

పాఠములు నేర్చుకొందురు. విద్యార్థులు అనుభవజ్ఞానమును ఇండ్లకు గొనిపోయి, శాంతియుతప్లవకారు లగుదురు.

యంగ్ ఇండియా, 11-7-'29.

7

# నవవిద్యాబోధకులు

## హృ ద య శి క్ష ణ

హృదయ శిక్షణనుగూర్చి ఒకమాట. ఇది పుస్తకముల ద్వారా రాదు. సజీవమగు గురు సంసర్గమువలననే అది యబ్బును. మనప్రయిమరీ, సెకండరీస్కూళ్ల అధ్యాపకులెవరు? విశ్వాసము, శీలముగల స్త్రీపురుషులా వారు? తాము హృదయశిక్షణ పొందినవారా? తన యధీనమందున్న బాల బాలికల సహజశక్తులను శ్రద్ధతో పోషింపగలవారా? చిన్న పాఠశాలోపాధ్యాయులను నియమించు పద్ధతి, బిడ్డల సౌశీల్యము పెరుగుటకు ఆటంకముగ లేదా? వారు బ్రతుకుటకు చాలినన్ని కూలిడబ్బులు గిట్టుచున్నవా? ఈ ఉపాధ్యాయులు వారి దేశభక్తినిబట్టి నియమింపబడుట లేదు. మరొక యుద్యోగము దొరకక వారు దీనికివత్తురు.

యంగ్ ఇండియా, 1-9-'21.

## స్వేచ్ఛ క్రమశిక్షణకు లోబడి యుండవలెను

విద్యార్థులు స్వేచ్ఛతో పనిచేయ నేర్చుకొనవలెను. వట్టి అనుకరణము పనికిరాదు. తమకు తాముగ యోచింపవలెను. కాని సంపూర్ణమగు విధేయతతో సుశిక్షితులు కావలెను. మహోన్నతమగు స్వేచ్ఛతో అపారమగు నియమనిష్ఠలు, వినయము కలిసి యుండవలెను. నియమబద్ధము, వినయ సంపన్నము నగు స్వేచ్ఛను ఎవరును కాదనలేరు. అదుపులేని స్వేచ్ఛావర్తనము నీచత్వమును తెలుపును. అది తనకు, తన పొరుగువారికి హానికరము.

యంగ్ ఇండియా', 3-6-'26.

## హృదయ పారిశుధ్యము అత్యవసరము

మంచివిద్యనుగడించుటకు వ్యక్తి జీవనపరిశుద్ధత అవసరము. వేలకొలది విద్యార్థులతో నాకు పరిచయమున్నది. నా పై విశ్వాసముతో వారు తమ హృదయ భావములను నాకు తెలుపుచుందురు. వీనినిబట్టి మనశ్శుద్ధి మరెంతైనా అవసర మనిపించును. నా యుద్దేశ్యమును మీరు బాగుగ గుర్తింతురు గాక! మనదేశ భాషలలో 'విద్యార్థి' అను మాటకుబదులు 'బ్రహ్మచారి' యను చక్కని పదమొకటున్నది. 'విద్యార్థి' యనునది కల్పించినమాట. బ్రహ్మచారి పదమునందున్నంత

అర్థము అందులో లేదు. 'బ్రహ్మచారి' యను మాటకర్థము ఈశ్వరాన్వేషకుడని. సాధ్యమైనంత త్వరలో భగవంతునికి సన్నిహితుడు కాగలవాడని, ఋజువర్తన కలవాడని. మలిన హృదయులగు స్త్రీ పురుషులు భగవానుని శ్వే. సింహాసనము యెదుట నిలువ నర్హులు కారను విషయములో ప్రపంచ గొప్ప మతములన్నియు, తమలో నెన్ని భేదములున్నను, పూర్ణమగు ఏకీభావమును కలిగియున్నవి. మన పాండిత్యములు, వేదాధ్యయనములు, సంస్కృత, గ్రీకు, లాటిన్ భాషలలో మనకున్న జ్ఞానమంతయు మనహృదయ పారిశుద్ధ్య సాధనకు సాయపడనిచో, అవన్నియు నిరర్థకమే. సౌశీల్యమును సమకూర్చుకొనుటయే సమస్తజ్ఞాన సముపార్జన యొక్క పరమావధి.

యంగ్ ఇండియా, 8-9-'27

## 'సేవ' విద్యలో నొకభాగము

మనప్రస్తుతవిద్యలో విద్వత్తుకు ప్రత్యేక ప్రాధాన్యత నిచ్చుట ఒక లోపమని సర్ M. విశ్వేశ్వరయ్యగారు నొక్కి చెప్పినారు. కాని దానిని మించినలోపము మరొకటున్నది. చదువు పాడుచేసుకొని, విద్యార్థులు ఏమాత్రపు తాత్కాలిక సేవా కార్య మందైనను పాల్గొన రాదను భావము వారిలో చొప్పింపబడుచున్నది. గుజరాతు విద్యార్థులు కొందరు

చేయుచున్నట్లు. బాధితుల సేవ యుత్తము, అవసరమును బట్టి, సాహిత్యవిద్యగాని, పారిశ్రామిక విద్యగాని కొన్నాళ్లు మాని వేయవలసివచ్చినను. విద్యార్థులకు లాభమే కాని నష్టము లేదు. సేవయే విద్యకు లక్ష్యము కావలెను. విద్యార్థిదశలో సేవచేయు అవకాశము లభించినచో. అదియొక అదృష్టముగా భావించవలెను. చదువును కట్టిపెట్టుటగా గాక, విద్యకు వన్నెబెట్టి. దానిని పరిపూర్తిచేయు విషయముగ సేవను పరిగణించవలె.

యంగ్ ఇండియా, 13-10-'27

## జీవులందరు ఒకటే

నీలోని యుత్తమ శక్తులన్నిటిని వికసింప జేసికొనుటయే నిజమైనవిద్య. మానవజీవిత గ్రంథమును మించు గ్రంథము మరేదికలదు? ప్రతిదినము హరిజన పల్లెలకువెళ్లి, వారిని ఏకమానవ కుటుంబములో తోడిసోదరులుగ చూడగలుగుటను మించినవిద్య మరియొకటేది? మనల నుద్ధరించి ఉన్నతి నీయగల చదువది, నా మతము సంకుచితముకాదు. ప్రధానముగ మానవ సౌభ్రాత్రమును అనుభవమునకు తెచ్చి కొనుటయే నామతము.

హరిజన్, 30-3-'34

## మేడమ్ మాంటిసోరికి లేఖ

చిన్నబిడ్డలపై మీ కున్న ప్రేమ చొప్పున అనేకసంస్థల ద్వారా విద్య నేర్పుచు, వారిలోని ఉత్తమశక్తులను వికసింప జేయుటకు మీరు కృషి చేయుచున్నారు. ధనవంతుల బిడ్డలకే గాక, నిరుపేదల పిల్లలకుగూడ మీ విద్యాలాభము కలుగ గలదని నే నాశించుచున్నాను. మీరన్నది సత్యము. మనకీ ప్రపంచమున శాంతి కోరకవలెనన్నచో, ప్రపంచ యుద్ధముపై నిజమైన యుద్ధమును ప్రకటించవలెనన్నచో, బిడ్డలతోనే మనపని ప్రారంభము కావలె. సహజమగు అమాయకత్వముతో వారు పెరిగినచో పోరాటములు అంతరించును. నిరర్థకములగు సోమరితీర్మానములు మనము వ్రాసికొన నక్కరలేదు. ప్రేమనుండి ప్రేమకు, శాంతినుండి శాంతికి మనము పురోగమించగలము. తుదకు యావత్ప్రపంచము శాంతిమయము, ప్రేమమయము కాగలదు. తెలిసియో, తెలియకనో పృథ్వియంతయు దానికొరకే దప్పిగొనియున్నది.

యంగ్ ఇండియా, 19-12-'31

# 8

## వట్టి పాఠపుస్తకముల చదువు చాలదు

### విద్యార్థులు విచక్షణ నేర్చుకోవలెను

తా మేది సేకరించవలెనో, ఏది విసర్జించవలెనో

విద్యార్థులు గుర్తించవలెను. పిల్లలకీ విచక్షణజ్ఞానమును కలుగజేయుట ఉపాధ్యాయుని విధి. విచక్షణలేక అంతయు స్వీకరించుటవలన మనము యంత్రములమైపోదుము. మనకు యోచన, తెలివి యున్నవి. సత్యము అసత్యము, మధుర భాషణము కటువుమాట, శుద్ధము అపరిశుద్ధము, ఇత్యాదులలోని భేదము ఈ వయసునందే గుర్తింపవలె. మంచి చెడ్డలను గ్రహించుటలోగల కష్టమునుమించిన కష్టములెన్నో ఈనాడు విద్యార్థుల నెదుర్కొనుచున్నవి. పుస్తకములతో పనిలేకయే ఋషులు శిష్యులకు బోధించువారు. కొన్ని మంత్రములను మాత్రము వారి కుపదేశించువారు. వానిని శిష్యులు శ్రద్ధతో పఠించి నిత్యజీవితమునం దుపయోగించుకొనువారు. ఈనాటివిద్యార్థి ఊపిరాడనంత పుస్తకరాశి మధ్యపడి బ్రతుకవలసియున్నాడు.

యంగ్ ఇండియా, 29-1'25

## పాఠపుస్తకములు

ఇండియాలో పాఠపుస్తకముల సంఖ్యనుపెంచుట యనగా లక్షలాది గ్రామబాలబాలికలకు సరియైన విద్యాపద్ధతిలేకుండ చేయుట యగును. పాఠశాలలోని కిందితరగతుల విద్యార్థుల కంటె ఉపాధ్యాయులకే పాఠపుస్తకములు ఎక్కువఅవసరము. పిల్లల ప్రారంభవిద్య చాలవరకు నోటితోనే బోధింపబడవలె

నని నా యుద్దేశ్యము. పిల్లలకు సామాన్య లోకజ్ఞానమును అందించకుండ అక్షరములు వ్రాయించి చదివించుటలో నష్టమున్నది. ఆ లేత వయస్సులో నోటిమాటలతో చేయబడు బోధనను చక్కగ జీర్ణించుకోగల అవకాశమును వారికి లేకుండ చేయుచున్నాము. ఏడేండ్లబాలుడు రామాయణ కథను తెలిసికొనుటకు వాడు గ్రంథపఠనము చేయ గలుగువరకు వేచియుండవలసినదేనా? ఇండియాలోని కోట్లాది గ్రామవాసులను గూర్చిన యోచనకును, కొలదిలక్షల పట్టణవాసులనుగూర్చిన యోచనకును చాలవ్యత్యాసమున్నది.

యంగ్ ఇండియా, 16-9-'26

## ఉపాధ్యాయులు - పాఠ పుస్తకములు

సర్కారుబడులలో ముఖ్యముగ చిన్నపిల్లలకు నియమింపబడు పాఠపుస్తకములు చాలభాగము నిరుపయోగములు. ఒక్కొకప్పుడు హానికరములుగూడ అగుటనిస్సందేహము. అందు చాల భాగము నిపుణులచే వ్రాయబడినవే. అవి ఎవరికి ఏ వాతావరణమున కుద్దేశింపబడినవో అందు కుపయుక్తములే కావచ్చును. భారతీయ బాలబాలికల కొరకు గాని, ఇక్కడి పరిస్థితుల ననుసరించిగాని అవి వ్రాయబడలేదు. అట్లైనచో అవి జీర్ణముచేసుకొనని అనుకరణములై యుండును.

విద్యార్థికి నిజముగ కావలసినది మాత్రము అందుండదు. ఈ దేశమున, ప్రాంతములనుబట్టి బిడ్డల తరగతులనుబట్టి, వారి అవసరములు భేదించుచుండును. ఉదహరణ : ప్రారంభ దశలో హరిజన పిల్లలయొక్కయు, మిగతవారి యొక్కయు అవసరములలో వ్యత్యాసముండును.

కనుక పుస్తకములు విద్యార్థులకంటె ఉపాధ్యాయులకే ఎక్కువ అవసరమని నాకుధృవమయ్యెను. పిల్లలకు పూర్తిగ న్యాయముచేయదలచు ప్రతి ఉపాధ్యాయుడును తనకున్న సామగ్రినిబట్టియు, జ్ఞానమునుబట్టియు పాఠములను తయారు చేసికొనవలెను. ఇవి కూడ తన తరగతి ప్రత్యేకఅవసరము లకు సరిపడునట్లుండవలెను.

విద్యార్థుల ఉత్తమ శక్తులను బహిర్గతము చేయునదే నిజమైన విద్య. అనవసరముగ ఏదో సమాచారముతో విద్యార్థుల మెదడును నింపుటవలన ఈ పని నెరవేరదు. అదివారికి భారమైపోవును. కల్పనాశక్తిని అణచివేసి వారిని నిర్జీవ యంత్రములుగ చేయును. మనమీవిధానమునకు బానిసలము కాకయుండినచో, ముఖ్యముగ ఇండియాలో ఈ ప్రాథమిక విద్యాపద్ధతి చేయుచున్న మోసమును ఇంతకు ముందెప్పుడో కనిపెట్టి యుందుము.

అనేక విద్యాసంస్థలు స్వంతపాఠపుస్తకములను తయారు

చేసికొని కొంత ప్రయోజనము పొందియుండవచ్చును. కాని దేశ ముఖ్యావసరముల నవి తీర్చలేకపోయినవి.

ఇక్కడ వ్యక్తపరచిన అభిప్రాయములు నాస్వంతములు కావు. హరిజన పాఠశాలల నిర్వాహకుల, ఉపాధ్యాయుల ఉపయోగార్థము అవి ఇచట పేర్కొనబడుచున్నవి. వారిపై అపార బాధ్యత కలదు. నిర్జీవమైన కర్మకలాపములతో వారు తృప్తి నొందరాదు. ఏవో దొరికిన పుస్తకపాఠములను చిలుకలవలె పలికించుట బిడ్డలయెడ వారినిర్లక్ష్యమునే చూపును. పెద్దబాధ్యతను వారు పైన బెట్టుకొన్నారు. వారు దానిని ధైర్యముతో, తెలివితేటలతో, న్యాయముగ నిర్వర్తించవలె.

ఈ పని కష్టమైనదే. అయినను పాఠశాల నిర్వాహకుడు లేక అధ్యాపకుడు తనహృదయము నిండు పూర్తిగచొప్పించినచో, అనుకొన్నంత కష్టముండదు. విద్యార్థులకతడు తండ్రివలె నున్నచో. వారి కేమికావలెనో సహజముగ అతడు గ్రహించి దానిని వారి కీయగలడు. అది తనవద్దలేనిచో, ఇయ్యగల అర్హతకొరకు పాటు పడును. పిల్లల ఆవశ్యకతలను బట్టి బోధన యుండవలె ననుకొంటిమి. కనుక హరిజన లేక ఇతరబాలుర అధ్యాపకునికి ఎట్టి అసాధారణ ప్రజ్ఞలుగాని ఉండనక్కరలేదు.

విద్యార్థుల నడవడిని చక్కబరచుటయే విద్యయొక్క ముఖ్యోద్దేశమై యుండగా నడవడిచక్కనైన ఉపాధ్యాయుడు అదృశ్యపడనక్కరలేదు.

హరిజన్, 1-12 '33.

# 9

# ఆత్మవిశ్వాసమును, చేతిపరిశ్రమయెడల గౌరవమును నేర్పవలెను

## ఆత్మ విశ్వాసము

నేను గురుకుల పక్షపాతిని. కనుక కమిటీవారికిని, తల్లి తండ్రులకును ఒకటిరెండు సలహాలీయగోరుచున్నాను. గురుకుల విద్యార్థులకు ఆత్మవిశ్వాసము స్వయంపోషక శక్తికావలసి నట్లైతే వారికి పూర్ణమైన పారిశ్రామికశిక్షణ నీయవలెను. నూటికి 85 పాళ్లు వ్యవసాయదారులును, పదిపాళ్లు వ్యవసాయపనిముట్లు చేయువారును గల ఈ దేశములో కొంతవరకు సేద్యము, చేనేత ప్రతియువకుని విద్యలోను ఒక భాగమై యుండవలెను. ఒక చెక్కను తిన్నగా కోయుట, గోడను సమమట్టముగ నిర్మించుట, వివిధములగు పనిముట్ల ఉపయోగము తెలిసియుండుటవలన విద్యార్థికివచ్చు నష్టమేమియు

లేదు. ఇట్లు తయారైన బాలుడు జీవితసంగ్రామములో నిస్సహాయత నెప్పుడును పొందడు. నిరుద్యోగసమస్య శాశ్వతముగ తీరిపోవును. ఆరోగ్యము, పారిశుద్ధ్యము, బిడ్డలపెంపకమును గూర్చిన విధులను తెలిసికొనుట గురుకులవిద్యలో విధిగా భాగమై యుండవలెను. ఈ ప్రదర్శనములోని పారిశుధ్యపు యేర్పాట్లు ఏమియు సరిగా లేవు. ఈగలబాధ ఎక్కువగా నుండెను. నివారింపరాని ఈ శానిటరీ ఇన్‌స్పెక్టర్లు పారిశుధ్యవిషయము మన కేమియు తెలియదని అనుక్షణము మనకు హెచ్చరిక నిచ్చుచునే యుండెను. తిని పారవేసిన వస్తువులు, మలమూత్రములు జాగ్రతగ గోతులలో పూడ్చిపెట్టవలెనుసుమా యని అవి స్పష్టపరచుచునే యుండెను. ఏటేటవచ్చు ప్రేక్షకులకు పారిశుధ్యమును గూర్చి ప్రత్యక్షపాఠములనిచ్చు అవకాశమును కోల్పోవు చున్నందుకు నేను విచారించితిని. ఈ పని బాలురతో ప్రారంభము కావలెను. వార్షికసమావేశ మప్పుడు ఈ పనిని దృష్టాంతపూర్వకముగ జరుపుటకు కార్యనిర్వాహకులు మూడువందలమంది బోధకులను ఏర్పాటు చేయవలెను. తల్లిదండ్రులు, కమిటీసభ్యులు తమబిడ్డలను యూరోపియను వేషభాషలలోను, భోగలాలసలోను దింపి పాడు చేయకుందురుగాక! ఇది చాలముఖ్యము. ఇవి బ్రహ్మచర్యమునకు శత్రువులై, వారి భావిజీవితమునకు ప్రతిబంధకము లగును. అందరికి వలెనే వీరికిని తమలోని

ప్రలోభములతో పోరాటముండనే యుండును. దీనికితోడు వారికింకను ప్రలోభములను కల్పించి జీవితపోరాటమును మరింతకష్టతరము చేయకుందుము గాక !

మహాత్మా గాంధి ఉపన్యాసములు, వ్రాతలు, పుట 334, 335.

## చేతి పరిశ్రమ

"మనము చేతుల నెందు కుపయోగించవలెను ? చదువు రానివారికే చేతిపని; సాహిత్యమును, రాజకీయవ్యాసములను చదువుకొనుటయే నాపని" అని మీా రనవచ్చును. పరిశ్రమ లోని గౌరవమును మనము గుర్తించవలెనని నాయుద్దేశము. ఒకమంగలికాని లేక చర్మకారుడుకానికాలేజీలోచదువుకొన్న తరువాత అతడు తనవృత్తిని మానుకొనరాదు. వైద్యవృత్తి ఎంతమంచిదో, మంగలిపనియు అంతేనని నాయభిప్రాయము.

మహాత్మాగాంధి ఉపన్యాసములు, వ్రాతలు. పుట 388, 389; 16-2-'16

ఇతర దేశములసంగతి యెట్లున్నను నూటికి ఎనభై పాళ్లు పైగా వ్యవసాయకులును, పదిమంది పారిశ్రామికులును గల ఇండియాలో మట్టుకు, విద్యను కేవలము పుస్తకపు చదువుగా చేసి, బాలబాలికల భావిజీవితమును పరిశ్రమకు పనికిరాకుండ చేయుట గొప్ప అపరాధము. మన సమయములో ఎక్కువ భాగము పొట్టకూటికై పడు శ్రమతోనే గడుచుచున్నది కనుక,

అట్టి శ్రమలోని గౌరవమును మనపిల్లలకు శైశవమునుండియు బోధపరచవలెను. శరీరశ్రమను తృణీకరించు విద్యను వారికి గరపరాదు. వ్యవసాయకుని కుమారుడు బడికి వెళ్ళుటచేత వ్యవసాయమునకు పనికిరాకుండ పోవుచున్నాడు. అందు న్యాయములేదు. స్కూలువిద్యార్థులు చేతిపరిశ్రమ యెడల విముఖత్వమునేకాక అసహ్యతనుగూడ కనబరచుట శోచనీయము.

యంగ్ ఇండియా : 1-9-'21.

## నూలువడకుట విధి

భవిష్యత్తులో ఏ విద్యావిధానము నందైనను నూలు వడకుట విధిగానేర్పబడవలెను. గాలి, అన్నము లేకున్న మనము బ్రతకలేము. అట్లే వడుకుపరిశ్రమను పునరుద్ధరించకుండ ఈ పురాతన దేశమునుండి దారిద్ర్యమును పారద్రోలుట, ఆర్థికస్వాతంత్ర్యమును పొందించుట అసంభవము. ఇంటిలో వంటపొయ్యి ఎట్లవసరమో రాట్నమును అంతే. అంతకంతకు పెరిగిపోవుచున్న ప్రజాదారిద్ర్య సమస్యను మరియే యితర ప్రణాళికగాని పరిష్కరించలేదు.

కాని ప్రతి యింటను రాట్నమును ప్రవేశపెట్టుట ఎట్లు? ప్రతి జాతీయ విద్యాలయమునందును నియామకముగ నూలు

పడికించుటనుగూర్చి నే నిదివరకే సూచన నిచ్చియున్నాను. మన బాలబాలిక లీకళను నేర్చుకొన్నమీదట దానిని సులువుగ తమయిండ్లకును తీసికొనిపోగలరు.

యంగ్ ఇండియా, 19-1-'21

# 10

## స్వయంపోషకము కావలెను

ప్రతివిద్యాలయమందును నూలువడకుట ప్రవేశపెట్టినచో, విద్యావ్యయమును గూర్చిన భావములు పూర్తిగ మారిపోవును. దినమునకు ఆరుగంటలు పనిచేయుచు పిల్లలకు ఉచిత విద్యనీయగలము. పిల్లవాడు నాలుగు గంటల చొప్పున రాట్నముపై పది తులముల నూలువడికి పాఠశాలకు ఒకఅణా సంపాదించగలడు. మొదటి నెలలో ఎక్కువపని జరుగదనియు నెలకు 26 దినములు పాఠశాలయుండుననియు అనుకొందము. తరువాత అతడు నెలకు రు 1-10-0 లు విధిగా సంపాదించగలడు. ముప్పదిమంది పిల్లలతరగతి చేయగల పనికిరాగల నెలసరిఆదాయము రు 48-12-0.

ఆరుగంటలలో మిగత రెండుగంటలు పుస్తకవిద్య కీయవచ్చును. కష్టములేకుండ ప్రతి విద్యాలయమును స్వయంపోషకము చేయగలము. అనుభవజ్ఞులగు అధ్యాపకులను నియమించవచ్చును.

ప్రణాళికను అమలు జరుపుటలో ముఖ్యమగు ఇబ్బంది రాట్నమే. ఈ కళ ప్రజారంజకమైనచో, వేలకొలది రాట్నములు కావలసి యుండును. ప్రతి గ్రామ వడ్రంగియు ఈ యంత్రాలను సులువుగ తయారుచేయగలడు. ఇది మన అదృష్టము. రాట్నములను ఆశ్రమమునుండిగాని మరొక చోటనుండిగాని తెప్పించికొనవలసియుండుట చాలపొరపాటు. రాట్నము చిక్కు పెట్టని సరళమైన పనిముట్టు. సులువుగ నేర్వదగినది; ప్రతిగ్రామమునందును చౌకగా ప్రవేశపెట్ట దగినది. ఇందులోనే దాని సౌందర్యమున్నది.

నేను సూచించినపద్ధతి ఈ సంవత్సరమునకు మాత్రమే. ఇది అభ్యాసమునకు, పారిశుధ్యమునకు ఏర్పడిన కాలము. స్వరాజ్యమువచ్చి, సహజ పరిస్థితులేర్పడిన తరువాత నూలు వడుకుటకు ఒక గంటమాత్రమే యిచ్చి, మిగతకాలము సాహిత్యవిద్య కీయవచ్చును.

**యంగ్ ఇండియా, 2 - 2 - '21**

మత్తు ద్రవ్యముల ఆదాయముతోగాని, భూమి పన్నుతో గాని విద్యాశాఖను నడుపరాదు. స్వపరిపాలనలో రాట్నపరిశ్రమయే దానికి ముఖ్యాధారము కావలెను. అన్ని పాఠశాలలలోను, కాలేజీలలోను రాట్నము, చేమగ్గము ప్రవేశపెట్టినచో విద్య సులువుగ స్వయంపోషకమగును. ఈనాడు మనబాలురు తమకాలమునంతను నూలువడుకుట కీయవలెనని

నేను కోరుదును. స్వరాజ్యము వచ్చినపిదప కనీస మొకగంట యైనను దానికీయవలెను. మనజీవితకార్యము లన్నిటియందును స్వరాజ్య దర్శన మగుచుండవలెను. ఈనాటి పాఠశాలలు బానిసలను తయారుచేయు యంత్రాగారములైనవి. స్వరాజ్యమందలి విద్య పిల్లలను చిన్నప్పటినుండియు స్వయంపోషకులుగ చేయయత్నించును. మరి యితర వృత్తులుకూడ నేర్ప వచ్చును. కాని, నూలువడకుట తప్పనిసరి. దిక్కులేని ప్రజకు రాట్నము ఊరట కలిగించును. దాని శక్తులు మరి దేనికిని లేవు. ఒక్కొక్కటే సేద్యమునకు పూరకపరిశ్రమ. అందరును వడ్రంగులు కాని, కమ్మరులుగాని కాజాలరు. అందరికిని బట్ట అవసరము కనుక అందరు ఈ పరిశ్రమ చేయవలెను. ఆదాయమును పెంచుకొనుటకుగాని, దేశము కొరకుగాని నూలు వడకుట విధాయకము.

సాహిత్యమునకు తోడు వడుకు పరిశ్రమనుకూడ మనము వెంటనే ప్రవేశపెట్టవలెను. స్వరాజ్యము వచ్చినతరువాత ఈ సమస్యను గూర్చి మరల మనకు పోరాటముండరాదు. కనుక వెంటనే ఈపని జరుగవలెను.

యంగ్ ఇండియా, 30-3-'21

మత్తుద్రవ్యముల ఆదాయముతో విద్యను పోషించుట దేశమునకు చాల అవమానకరమని చెప్పసాహసించుచున్నాను. వివేకముతో, మద్యపాన దురాచార నిర్మూలనము

నిశ్చయింపబడనిచో మనతరువాతి సంతతి మనలను నిందింతురు. ధనాభావమువల్ల బిడ్డలకు విద్య లేకనే పోయినను, అంత ప్రమాదము లేదు. కాని విద్యలేని అవస్థ కలుగ బనిలేదు. రాట్నపరిశ్రమను ప్రవేశపెట్టి, విద్యను స్వయంపోషకము చేయవచ్చునను మాట మీలో చాలమందికి హాస్యాస్పదముగ నుండునని నే నెరుగుదును. కాని విద్యాసమస్యను ఇంత చక్కగ పరిష్కరించగల పథకము మరేదియు ఉండబోదని చెప్పగలను. దేశ మిక క్రొత్తపన్నుల భారము మోయలేదు. ఉన్న పన్నులే దుర్భరముగ నున్నవి. కల్లు, సారాయి, నల్లమందు వలని ఆదాయమును నిషేధించుటేగాక ఇతరపన్నులను గూడ తగ్గించవలసి యుండును. లేకున్నచో, నిత్యమును పెరిగిపోవుచున్న దేశ దారిద్ర్యమును నిర్మూలింపలేము.

యంగ్ ఇండియా, 8-6-'21

బిడ్డల విద్యకోసమని తల్లిదండ్రులు, గత్యంతరము లేక ఎన్ని అక్రమములకు పాల్పడుచుండుట లేదు? ఇక నైన మన విద్యా విధానమును మార్చుకొనకపోయినచో, ఇంకను గడ్డుకాలము రానైయున్నది. మనదేశపు శిశుసముద్రము యొక్క అంచునుమాత్రమే మన మింతవరకు తాకగలిగినాము. ఈమహాసముద్రము విద్యాగంధములేక పడియున్నది. విద్య అక్కరలేక కాదు; తల్లిదండ్రుల అవివేకము, అశక్తత వలన తల్లిదండ్రులు వయస్సు వచ్చినబిడ్డల నెందరినో ఊరక

పోషించుచు, అమితవ్యయముతో గూడిన విద్య నిప్పించు చున్నారు. చదువుకొను బిడ్డలవలన సద్యఃఫలిత మేమియు కనబడదు. దీని మూలముందేదో దోషమున్నది. విద్యా రంభమునుండియు బిడ్డలు తమకగుఖర్చును పనిద్వారా సంపా దించుటలో తప్పేమాత్రమును కనుపించదు. దేశమంతటికిని అవసరమైనది, అందరు చేయదగినది నూలు వడుకుట— దానికి సంబంధించిన పనులన్నిటితో సహా. ఇందువలన మూడుఉద్దేశములు నెరవేరును. విద్యను స్వయంపోషకము చేయుట యొకటి ; బిడ్డలశరీరములకును మనస్సులకు గూడ క్రమశిక్షణనిచ్చుట రెండు ; విదేశీనూలు, విదేశీవస్త్రము యొక్క సంపూర్ణ బహిష్కరణము మూడు. అంతే కాక, ఇట్లు తయారగు పిల్లలకు ఆత్మవిశ్వాసమును, స్వేచ్ఛయు అబ్బును.

యంగ్ ఇండియా, 15 - 6 - '21.

ఈడువచ్చిన బాలబాలికలందరు పాఠశాలకు వెళ్లవలసి నచో, ప్రస్తుత విద్యావిధానమునకు వలసినంతధనము మనకు లేదు. నేడు విధింపబడుచున్న బడిజీతములు బిడ్డల సంరక్షకులు ఇచ్చుకొననూ లేరు. విద్య సార్వజనికమైనచో, అది ఉచితవిద్యకూడ కావలెను. ఆదర్శ ప్రభుత్వమునం దైనను, అందరుపిల్లలకు విద్యకు కావలసిన రెండువందల కోట్లరూపాయలఖర్చుకుమనకు తాహతు లేదు. కనుక విద్యార్థుల

బడిజీతములు అంతగాని, కొంతగాని వారిపనిద్వారా రాబట్ట వలెను. అట్టి ఉపయుక్తమైన పని నూలువడుకుట, నేత ఒక్కటేయని నాకు తోచుచున్నది. కాని నా స్వయంపోషక సూత్రముదృష్ట్యా ఆ పరిశ్రమ మరొక ఉద్దేశమును కూడ, కావచ్చును. కాని ఆచరణీయము, లాభకరము, దేశమంత టను విరివిగ సాగింపదగినది వస్త్రనిర్మాణ మొక్కటే యని పరిశీలనపై తెలియగలదు.

చేతిపనులను ప్రవేశపెట్టుట ఈ దరిద్రదేశమునకు రెండు విధాల శ్రేయోదాయకము. పిల్లలవిద్య కగువ్యయమును అది భరించుట యొకటి. తరువాత, ఇష్టమున్నచో, వారు దానినే జీవనవృత్తిగ చేసికొనగలుగుట రెండవది. దీనివల్ల బిడ్డలకు ఆత్మవిశ్వాసము కలుగును. పరిశ్రమను నిరసించువిద్యవలన దేశము అవినీతిపాలైనంతగ మరి దేనివలనను కాజాలదు.

యంగ్ ఇండియా, 1 - 9 - '21.

## 11

## విద్యార్థిలోని సర్వశక్తులను వృద్ధిపరచుట

### సర్వాంగీణమగు విద్య

చేతులు, కాళ్లు, కళ్లు, చెవులు ముక్కు మొదలగు అవ యవములకు తగుశిక్ష నిచ్చుటద్వారానే నిజమైన మానసి కాభివృద్ధి కలుగగలదని నా విశ్వాసము. అనగా బిడ్డయొక్క

అవయవములను వివేకముతో పనిలో బెట్టుట మెదడుకు త్వరితముగ వికాసమునీయగల ఉత్తమసాధనము. కాని మనశ్శరీరములు కలసి వృద్ధిచెందుచు, తోడ్తోడ ఆత్మను మేల్కొల్పనిచో మొదటి రెంటిది నిరర్థకమగు పాశవికవ్యాపారమగును. ఆధ్యాత్మిక శిక్షణయనగా హృదయ వికాసమని నా యర్థము. ఆధ్యాత్మిక, శారీరక శిక్షణతో కలిసి విద్య నడచినపుడే, మానసికశక్తులకు చక్కనివికాసము కలుగును. ఇవన్నియు విడదీయుటకు వీలులేని ఒకేవస్తువు. ఒక్కొక్కటిగ విడదీసి వానిని వృద్ధికి తేవచ్చుననుకొనుట పై సిద్ధాంత దృష్టిలో చాల పొరపాటు.

పై మూడుశక్తులను సరిగా సమన్వయించకపోవుటవల్ల కలుగు దుష్ఫలితములు స్పష్టముగ కనబడుచునే యున్నవి. అవన్నియు మన సంఘమును అలుముకొనియే యున్నవి. మనప్రస్తుత వక్రజీవిత సంబంధములనుబట్టి వాటిని మనము చూడలేకున్నాము. మనగ్రామప్రజల విషయ మాలోచింపుడు. బాల్యంనుండి వారు దినమంతయు కష్టించి పొలములో పనిచేయుదురు. వారి పశువులమధ్యనే వారియునికి. వాటి కష్టమువంటిదే వారికష్టముకూడ. వారి బ్రతుకంతయు అలసటతో, నిర్జీవమగు బండచాకిరితో సరిపోవును. ఇంచుకమనో వికాసముగాని ఆత్మసౌందర్యముగాని లేదు. మనస్సును ఆత్మను వికసింపజేయు అవకాశములు లేక, వారు పసువుల

స్థితికి వచ్చినారు. దుఃఖకరమగు అధ్వాన్నపుజీవితము నెట్లో ఈడ్చుకొంటూ కాలక్షేపము చేయుదురు. ఈనాటి పట్టణపాఠశాలలలోను, కాలేజీలలోను విద్య అనబడున దంతయు మనోశక్తుల దుర్వినియోగమే. వారి దృష్టిలో మానసిక శిక్షణకును, శారీరకశ్రమకును ఎట్టిసంబంధము లేదు. ఆరోగ్యమునకేదో యొక పరిశ్రమ కావలెను కనుక నిరుపయోగములగు కృత్రిమవ్యాయామములతో కాలక్షేపము చేయుదురు. ఇట్టి శుష్క-వ్యాయామముతో తయారైన యువకునికి సామాన్య శ్రమజీవికున్న సహనశక్తి యుండదు. కించిత్తు పనిచేయగానే తలనొప్పి బయలుదేరును. ఎండలో కొంచెముసేపు నిలిచినచో తలదిమ్ము పుట్టును. మీదుమిక్కిలి, ఇదంతయు 'సహజమే' అని అతడనును. ఇక హృదయము శిక్షణలేక పెడమార్గమునబడి పరుగిడుచుండును. నైతిక, ఆధ్యాత్మిక అరాచకమే దీని తుదిఫలము. కాని ఇదంతయు మెచ్చుకోదగిన విషయముగ గణింపబడుచున్నది!

ఇట్లుగాక ఆదినుండియు శ్రద్ధతో హృదయవికాసమును పొందిన బిడ్డవిషయము తీసికొనుడు. నూలువడుకుట, వడ్రంగము, సేద్యమువంటి ఉపయుక్తమగు ఒకవృత్తిలో శిక్షణ పొందుచు, ఆకళకుసంబంధించిన జ్ఞానము, పనిముట్ల ఉపయోగము, వాటితయారు నేర్చిన మరియొక పిల్లవాడితడు. అంగసౌష్ఠవము, ఆరోగ్యమైనశరీరము, అనుభవ జ్ఞానము

యొక్క నిత్యపరీక్షలలో ఉత్తీర్ణమైన మనశ్శక్తినికూడ అతడు కలిగియుండును. కేవల విద్వత్తుతో కూడిన మెదడు కాదది. మానసిక విద్యలో గణితశాస్త్రజ్ఞానమును, తన వృత్తిని జయప్రదము చేయగల వివిధశాస్త్రముల సంపూర్ణ జ్ఞానమును, అందు కలిసియుండును. మనోల్లాసముకొరకు సార స్వతపఠనమునుగూడ వీటికి చేర్చినచో, ఆవిద్యపూర్ణమగును. ఇందుమనస్సు, శరీరము, ఆత్మసమవికాసమును పొంది, సహజ మగు సమగ్రజీవితము సిద్ధించును. మనుష్యుడనగా కేవలము మేధస్సుగాని స్థూలశరీరముగాని కాదు. ఒక్కహృదయమే లేక ఒక్క ఆత్మయేకూడ కాదు. పూర్ణమానవుడు తయా రగుటకు ఈమూటియొక్క సరియైన సమపాళ్ళ కలయిక అవ సరము. ఇదియే విద్యనుగూర్చిన నిజమగు అర్థశాస్త్రం.

హారిజన్, 8.5-37.

# 12

## వృత్తియే కేంద్రము కావలెను

గ్రామపరిశ్రమలను విద్యకు కీలకముగాను, కేంద్రముగను చేసి నేర్పవలసిన ఆవశ్యకతను, విలువనుగూర్చి నాకణుమా త్రమును సందేహములేదు. నేటి విద్యాసంస్థలు అనుసరించు పద్ధతి విద్యయని నే నన‌ను, మానవుని ఉత్తమశక్తులను బయ టకు తెచ్చుట కది ఉపయోగించదు. దానిని మానసిక వ్యభి

చార మనవలె. అయినది కానిది ఏదో యింత చెప్పుటతో దాని పని సరి. అట్లుగాక, ఆదినుండియు గ్రామపరిశ్రమలను కేంద్రముగచేసి, తద్వారా శిక్షణనిచ్చుపద్ధతి నిజమైన మానసికవికాసము నిచ్చును. ఈపద్ధతి మానసికశక్తులను ప్రత్యక్షముగను ఆత్మశక్తిని పరోక్షముగను భద్రపరచును.

హరిజన్, 5-6-'37.

పిల్లలవిద్యాభ్యాసమును ఉపయుక్తమగు చేతిపరిశ్రమలతో నేను ప్రారంభింతును. మొదటి నిమిషమునుండియు పిల్లలు వస్తునిర్మాణశక్తిని కలిగియుందురు. ఇట్టివిద్యాపద్ధతి కింద మనస్సు ఆత్మ అత్యున్నతాభివృద్ధినొందుట సాధ్యమగును. అయితే ప్రతిచేతిపనియు ఇప్పటివలె యంత్రవతుగాగాక శాస్త్రదృష్టితో నేర్పబడవలెను. ఏపని ఎందుకుచేయవలెనో బిడ్డ తెలిసికొని మరీచేయవలెను. నమ్మిక లేకుండ నేనీమాట యనుటలేదు. దీనివెనుక స్వానుభవమున్నది. నూలుపరిశ్రమ నేర్పబడు అన్నిచోట్ల ఈపద్ధతియే పూర్తిగ ననుసరింపబడుచున్నది. పాదరక్షలు చేయుట, నూలువడుకుట కూడ నేను స్వయముగ నేర్పినపుడు మంచి ఫలితములు వచ్చినవి.

హరిజన్, 31-7-'37.

•

# నాల్గవ భాగము

# మతవిద్యాసమస్య

## 13

## మతవిద్య

ఈ సమస్య చాల క్లిష్టమైనది. అయినను దానిని విడిచియూరకుండుటకు వీలులేదు. ఇండియా యెన్నటికిని నాస్తికదేశము కానేరదు. భారతభూమిపై గడ్డు నాస్తికవాదము వృద్ధిచెంద జాలదు. మతవిద్యను గూర్చి తలచినపుడు నాతల తిరుగును. ఈ పని కఠినమైనది. మన మత బోధకులు స్వార్థపరులు, కపటవర్తనులు; వారివద్దకు మనము వెళ్లవలసి యుండును. ముల్లాలు, దస్తూర్లు, బ్రాహ్మణులు అధికారమును తమచేతనే బెట్టుకొనియున్నారు. వారిలో సుబుద్ధి కొరవడినప్పుడు, ఆంగ్లవిద్యనుండి మనము పొందినశక్తిని మత విద్యవైపునకు త్రిప్పవలెను. ఇది యంత కష్టముకాదు. ప్రజా సముద్రపు అంచుమాత్రమే మైలపడియున్నది. ఆ యంచున ఉన్నవారికి మాత్రమే శుద్ధికావలెను. ఈ తెగ క్రిందికివచ్చు మనమును శుద్ధిగావించుకొనవలసి యున్నాము.

ఈ మాట భారత ప్రజాకోటి కంతకును వర్తించదు. ఇండియాను ప్రాచీన ఔన్నత్యమునకు తేవలెనన్న మనము వెనుకకు మరలవలెను.

హింద్ స్వరాజ్ (1908) పుట 107.

మతమనగా సత్యము, అహింసయని నాభావన. లేక సత్యమే మతమన్నను చాలును. అహింస సత్యములో ఇమిడి యున్నది. సత్యమును కనుగొనుట కత్యావశ్యకమగు సాధన మది. సత్య అహింసలను అభ్యసించు సాధనమేదియైనను మత విద్యకు కూడ సాధనమగును. ఉపాధ్యాయులు ఈధర్మములను తమ జీవితములందు కచ్చితముగ ఆచరించుటయే ఈకార్యము నెరవేరుటకు ఉత్తమ మార్గమని నా యభిప్రాయము. పాఠ శాలలోను, ఆటస్థలమునందును అట్టి ఉపాధ్యాయులు విద్యార్థులతో కలసియుండుట వలననే విద్యార్థుల కిందుమంచి శిక్షణ లభించును.

విశ్వజనీనములగు ముఖ్య మత సూత్రములను గూర్చిన శిక్షణ ఇది. మత విద్యా బోధలో తనవి కాని మతముల యొక్క ముఖ్యసిద్ధాంతములు కూడ కలసి యుండవలెను. ఆ సిద్ధాంతములను భక్తిశ్రద్ధలతోను, హృదయ విశాలత తోను విద్యార్థులు తెలిసికొని గౌరవించునట్లు చేయవలెను. ఈ పని సరిగా జరిగినచో, స్వమతమును సరిగా గౌరవించు శక్తియు, ఆత్మవిశ్వాసమును విద్యార్థులకు కలుగును. గొప్ప

మతములనుగూర్చి తెలిసికొనునపుడు ఒకముఖ్యనియమమును పాటించవలెను. ఆయా మతములకుచెందిన భక్తాగ్రేసరుల వ్రాతలద్వారానే మనమువానిని పఠించవలెను. ఉదాహరణకు: ఒకడు భగవద్గీతను చదువవలెనన్నచో, దానియందత్యంత ఆదరాభిమానము లున్నవాని అనువాదమును చదువవలెనే కాని, వ్యతిరేక విమర్శకుని అనువాదమును కాదు. అట్లే క్రైస్తవభక్తుల వ్యాఖ్యానముల ద్వారానే మనము బైబిలును చదువవలెను. తన మతముతోపాటు, తదితర మతములను గూడ పఠించుటవలన సర్వమతముల మూలమందు సుస్థిరమై యున్న ఏకత్వమును గ్రహింపనగును. మత సాంప్రదాయ ముల ధూళికి ఆవలనున్న విశ్వజనీనమగు పూర్ణసత్యము యొక్క దర్శన లాభము కలుగును.

ఇతర మతధర్మములను భక్తితో గ్రహించుటవలన స్వమత విశ్వాసము సన్నగిలునను భయమెన్నడును ఉండరాదు. సత్యముయొక్క మూలసూత్రములు అన్ని మతములలోను ఇమిడియున్నవని చెప్పి, అన్నిటి యెడలను భక్తిగౌరవము లుంచుట విధాయకమని హిందూ తత్వశాస్త్రము చెప్పెను. దీనికిముందు ఎవరి మతమునందు వారికి విశ్వాసముండవలెనని వేరుగ చెప్పబనిలేదు. స్వమతముయెడ కలుగు గౌరవము ఇతర మతములపై గూడ సహజముగ వ్యాపించవలెను.

ఇక్కడ మతము, సంస్కృతి సమాన స్థానమాక్రమించును. స్వజాతి సంస్కృతి సంరక్షణ వలన ఇతర జాతులసంస్కృతుల పట్ల తృణీకార భావము కలుగరాదు. ఇతరుల సంస్కృతు లన్నిటిలోగల మంచిని జీర్ణింప జేసికొనవలెనని స్వజాతి సంస్కృతి కోరును. మత విషయమున పాటింపవలసిన ధర్మ మును ఇదే.

యంగ్ ఇండియా :6-12-'28

# అయిదవ భాగము

# భాషా సమస్య

## 14

### విద్యాగరపు భాషాసాధనము

### మాతృభాష

ఇక్కడికివచ్చు విద్యార్థులందరికిని మాతృభాషలలో విద్యగరపు బాధ్యతను ఈ విశ్వ విద్యాలయము * వహించునని నేనాశించుచున్నాను. మనభాష మన ప్రతిబింబమే. మన దేశభాషలు మన ఉత్తమ భావములను వ్యక్తపరచలేనంత బలహీనములని మీరందురేమో! అట్లైనచో, ఎంత త్వరలో మన మీ పృథ్వినుండి తుడిచివేయబడిన మనకంత మంచిదని నేనందును. ఇంగ్లీషు ఎప్పుడైనా మన జాతీయభాష కాగలదని కలనైన తలచువారుందురా? ('ఎన్నటికి కాదు' అని సభలో కేకలు). ఈజాతికి ఎందుకింత మోయలేని బరువు? ప్రతి ఆంగ్లబాలునితోను ఎంత అసమానమగు పందెములో మన బాలురు పరుగిడవలసియున్నారో కొంచె మాలోచింపుడు. పూనా ప్రొఫెసర్లకును నాకును ఒక సంభా

---

* కాశీ హిందూ విశ్వ విద్యాలయము

షణ జరిగెను. ఆంగ్లభాషలో విద్యనేర్పుటవలన ప్రతిభారతీయ యువకుడును కనీసము అమూల్యమగు ఆరుసంవత్సరముల జీవితకాలమును కోల్పోవుచున్నాడని వారనిరి. ఆసంఖ్యను మన కళాశాలల, పాఠశాలల విద్యార్థులమొత్తము సంఖ్యచే గుణించి, ఎన్నివేల సంవత్సరములు ఈజాతి కోల్పోయినదో లెక్కవేయుడు. ప్రయత్నశీలురము కామని మనపైన ఒక నిందయున్నది. విలువైన జీవితకాలమును పరభాషా పాండిత్యము కోసము ఖర్చుపెట్టవలసి యుండగా, మనము ప్రయత్నశీలురమెట్లు కాగలుగుదుము? చివరకా పాండిత్యమును మనకు రాదు. . .ఇంగ్లీషునేర్చిన ఇండియనులే కదా దేశనాయకులై ప్రజోపకారము చేయుచున్నారని కొందరను చుందురు. అట్లుకాకుండినచో పరిస్థితులు చాల ఘోరముగ నుండెడివని, మనకున్న విద్యయంతయు ఆంగ్లవిద్యయేయని, దానికేదో ప్రతిఫలము మనము చూపవలెనని యందురు. కాని కడచిన అర్ధశతాబ్దకాలము దేశభాషలద్వారా మన విద్యాభ్యాసము జరిగియుండినచో, ఈనాడుమనస్థితి యెట్లుండెడిది? ఇండియాకుస్వాతంత్ర్యము వచ్చియుండును. మనవిద్యాధికులు స్వదేశములో విజాతీయులవలెనుండక, జాతిహృదయముతో కలిసియుండెడువారు. నిరుపేదలకు సేవచేయుచుండువారు. ఇట్లు యేబదియేండ్ల పొడుగున వారు పొందిన లబ్ధి జాతి సౌభాగ్యమును కూర్చియుండెడిది, ఈనాడు మనభార్యలే

మన యుత్తమ భావములలో భాగస్వాములు కాలేకున్నారు. ప్రొఫెసరు బోసు, ప్రొఫెసరు రేగార్ల అద్భుత పరిశోధనలను చూడుడు. అవి సామాన్యప్రజల సొత్తు కాజాలకపోవుట సిగ్గుకరము కాదా ?

మహాత్మాగాంధి ఉపన్యాసములు, వ్రాతలు. పుట 318 - 20; 4 - 2 - '16.

## పరభాషాసాధనము

విదేశభాషతో చేయబడు ఈ బోధనమెదడును ప్రయాస పెట్టినది; పిల్లలనరములకు మితిలేని శ్రమకలిగించినది; వారిని ఊరక కంఠస్థము చేయువారుగను, అనుకరించువారుగను చేసినది; స్వతంత్రాలోచనకు పనికిరాకుండ చేసినది, తమను తమదేశమునందే విజాతీయులుగ చేసినది. ఇప్పటి విధానములో అత్యంత దుఃఖకరమగు విషయమిదే. దేశభాషల వికాసమునకు అడ్డుతగిలిన దిదియే. నాకు సర్వాధికారమున్నచో పిల్లలకు విదేశభాషతో బోధించుపద్ధతిని వెంటనే రద్దుచేయుదును, ఉపాధ్యాయులును, ప్రొఫెసర్లును మార్పును వెంటనే అమలుపరచనిచో వారిని బర్తరఫుచేయుదును. పాఠపుస్తకములు తయారగువరకు వేచికూర్చుండను. మార్పుతో అవియు వచ్చును. ఇదిమాత్రము తక్షణామే నిర్మూలము కావలసిన కీడు.

యంగ్ ఇండియా, 1-9-'21

జాతిగౌరవమును నిలుపుటకుగాను విద్యయంతయు (ఉన్నతోన్నతమగు విద్యకూడ) ప్రాంతీయభాషలలోనే నేర్పబడవలె నను స్వయంవ్యక్త సత్యమును వేరుగ ఋజువుచేయబని లేదు. ఉన్నతవిద్య యనబడున దంతయు మనకు ఇంగ్లీషులోనే నేర్పబడియుండుటచేతనే ఇది ఋజువుచేసికోవలసిన అవస్థపట్టినది. ప్రజలభాషలో విద్యనుబడసి జీర్ణించుకొనక పోయినచో ఈ దేశ యువకులు ప్రజాశ్రేణితో సన్నిహిత సంబంధమును కల్పించుకొనజాలరు. ఇది స్వయం స్పష్టవిషయము. నిత్యజీవితములో మనకు పనికిరాని ఒకపర భాషాసాంప్రదాయమును అందలి ప్రయోగములను వేలకొలది యువకులు విధాయకముగ నేర్చుకొనవలసి వచ్చుటవలన జాతికెంత అపారనష్టము వాటిల్లుచున్నదో ఎవరు లెక్కవేయగలరు? పరభాషాసేవలో, స్వభాషలు, వానిలోని సాహిత్యము నిర్లక్ష్యము చేయబడక తప్పదు. ఏభాషగాని వృద్ధిచెందుట కవకాశము లేదని, గభీరభావములను వైజ్ఞానిక విషయములను వ్యక్తపరుపజాలదని యనుకొనుట పట్టిమూర్ఖ్యము. మాట్లాడు వారిస్వభావమును, పెంపును సరిగా ప్రతిబింబింప జేయున దే భాష.

పరభాషను శిక్షణకు సాధనముగా విధించుట పర ప్రభుత్వమువలన కలిగిన వినాశకరపు చెడుగులలో ఒకటిగ చరిత్ర పరిగణించును. అది జాతిని నిర్వీర్యముగ జేసినది.

విద్యార్థుల ఆయుఃప్రమాణమును తగ్గించినది. వారిని ప్రజలకు దూరస్థులను చేసినది. విద్యావ్యయమును అనవసరముగ పెంచినది. ఇది ఇట్లే మనలను వదలకయుండినచో ఈ జాతిఆత్మయే నశించిపోగలదు. కనుక, మనవిద్యాధికులు ఎంతత్వరలో ఈపరభాషా వ్యామోహమునుండి విడివడుదురో, వారికిని ప్రజకును గూడ అంతశ్రేయము.

యంగ్ ఇండియా, 5-7-'28.

## నా స్వానుభవము

స్వానుభవము నుండి ఒక అధ్యాయము వినిపింతును. 12 ఏండ్లవయస్సువరకు నేను నేర్చినదంతయు నామాతృభాషయగు గుజరాతీద్వారానే. కొంతగణితము, చరిత్ర, భూగోళము తెలిసికొంటిని. తరువాత హైస్కూలులో, మొదటి మూడుసంవత్సరములును మాతృభాషద్వారానే బోధన జరిగెను. కాని, ఇంగ్లీషునెట్లో విద్యార్థుల తలకెక్కించుటయే ఉపాధ్యాయుని పనియయ్యెను. ఇట్లు మాకున్న సమయములో సగభాగము తెన్నులేని దాని నిరంకుశవర్ణక్రమమునకును, ఉచ్చారణకును సరిపోయెడిది. వ్రాతనుబట్టి ఉచ్చరింపబడని భాషను నేర్చుకొనుట ఎంత తలనొప్పియో తెలియవచ్చెను. వర్ణక్రమమును కంఠస్థము చేయవలసియుం

డుట ఒకవింత అనుభవము. అయినను మొదటి మూండే డ్లును ఒకవిధముగ గడచినది.

నాల్గవయేట బొంబాయి ఆరంభమయ్యెను. రేఖాగణితము, బీజగణితము, రసాయనికశాస్త్రము, ఖగోళ, భూగోళ శాస్త్రములు, చరిత్ర అన్నియు ఇంగ్లీషులోనే నేర్వవలసియుండెను. ఆభాషానిరంకుశత్వము ఎంతమితిమీరె ననగా, సంస్కృతపారసీక భాషలుకూడ ఇంగ్లీషుననే నేర్పబడెను; మాతృభాషలో కాదు. ఏ విద్యార్థికాని తన గుజరాతీలో మాట్లాడినచో వాడు శిక్షింపబడెను. తప్పుడు ఇంగ్లీషును తప్పుడు ఉచ్చారణతో మాట్లాడినను ఉపాధ్యాయునికి అభ్యంతరము లేదు. నిజమే, ఆబాధ అధ్యాపకుని కెందుకు? అతని ఇంగ్లీషుకూడ నిర్దోషమైనది కాదుకదా? విద్యార్థులకువలెనే అతనికిని అది పరభాషయే. ఫలితము అరాచకము. చాల విషయములు మాకు అర్థమయ్యెడివికావు. అయినను వాటిని కంఠస్థము చేయవలసినదే. ఉపాధ్యాయుడు రేఖాగణితము మాకు అర్థమగునట్లు చెప్పలేక కొట్టుకొనెడువాడు. అదిచూచి నాతల తిరిగిపోయెడిది. యూక్లిడ్ లోని 13 సిద్ధాంతముల వరకు నాకు తల, తోక తెలియలేదు. మాతృభాషాభిమానము నాకెంతయున్నను రేఖాగణితము, బీజగణితము మొదలగు వానిలోని సాంకేతికపదములకు సరియైన గుజరాతీ మాటలు నాకిప్పటికిని తెలియవు. నాలుగేండ్లలో నేను చదివిన

అంక, రేఖా, బీజగణితములను, రసాయనిక, ఖగోళ శాస్త్రములను ఇంగ్లీషులో కాక గుజరాతీలో చదివియున్నచో ఒక్క సంవత్సరములో వాటిని సునాయాసముగ నేర్చుకొనగలిగియుందును. ఇంతకంటెను సులువుగను, స్పష్టముగను అవి బోధపడియుండెడివి. నా గుజరాతీపదజాలము చాల పెరిగియుండెడిది. నాజ్ఞానమును నాయింట వినియోగపరచి యుందును. ఈ ఇంగ్లీషు మధ్యవర్తిత్వము నాకును, యింగ్లీషురాని నా కుటుంబమునకును మధ్య దాటరాని అఖాతమును కల్పించెను. నా చదువేమో మాతండ్రికి తెలియదు. నాచదువును గూర్చి ఆయనకు చెప్పసాహసింపనైతిని. తెలివిగలవాడైనను ఆయనకొక్క ఇంగ్లీషుముక్క రాదు. అతివేగముగ నా యింటిలో నేను పరాయివాడనై పోవుచుంటిని. నిశ్చయముగ నేను గొప్పవాడనై పోతిని. నాదుస్తులలోకూడ, కనబడకుండ, మార్పులు వచ్చినవి. ఈ నా యనుభవములో ప్రత్యేకత యేమియు లేదు. చాలమంది నావలెనే అయిపోయిరి.

హైస్కూలులో మూడేండ్లలోను నాజ్ఞానమేమియు పెరుగలేదు. ప్రతిపాఠమును ఇంగ్లీషులో అర్థము చేసికొనునట్లు మమ్ము తయారు చేయుటలోనే మూడేండ్లును గడచెను. ఇండియాపై సాంస్కృతి విజయమును సాధించుటయే ఈ ఇంగ్లీషు హైస్కూళ్ల ఉద్దేశము. మాస్కూలులోని మూడు వందల విద్యార్థుల జ్ఞానము అతిసంకుచిత వ్యవహారమయ్యెను.

అది ప్రజానీకమునకు వ్యాపించునది కాకపోయెను.

సారస్వతమును గూర్చి ఒకమాట. ఇంగ్లీషు పద్య వచన పుస్తకములెన్నో నేను చదువవలసియుండెను. కాని ప్రజానీకముతో నేను కలియగలుగుటకును, నా సేవ వారికి అంద జేయుటలోను అది నాకేమాత్రమును సాయపడలేదు. ఈ యింగ్లీషుగ్రంథపఠనము లేకపోయినచో నేనొక అమూల్యావకాశమును కోల్పోయి యుందునని నే ననుకొనలేదు. అమూల్యమైన ఆ యేడేండ్లలో గుజరాతీలోనే నాపాఠములను చదువుకొన్నచో, నా జ్ఞానము సులువుగ నా యిరుగు పొరుగులందరికి గూడ ఉపకరించియుండెడిది. నా గుజరాతీ భాషనుకూడ సారవంతముగ చేసియుందువాడను. అపారమగు నా దేశభక్తితోను, భాషాభిమానముతోను, నిరంతర పరిశ్రమతోను అధికతరముగ ప్రజాసేవ చేయగలుగువాడను.

ఇంగ్లీషుభాషను కాని, సాహిత్యమును కాని నేను నిరసించుచున్నానని ఎవరును తలపకుందురు గాక! ఆంగ్లము యెడల నాకుగల ప్రేమకు "హరిజన్" పత్రికావ్యాసములే నిదర్శనము. ఇంగ్లాండులోని శీతోష్ణస్థితి, అక్కడి ప్రకృతి స్వరూపము ఇండియాకెట్లు ఉపకరింపవో అట్లే దాని సారస్వత విశిష్టతయు భారతిజాతికి పనిచేయదు. ఇండియా శీతోష్ణములు, ప్రకృతిసౌందర్యము సారస్వతము ఇంగ్లాండు వాటికి తీసిపోవచ్చును. అయినను ఇండియా తన శీతోష్ణములకు,

ప్రకృతికి తగినట్లు తనస్వాతంత్ర్యముతోనే తాను పెంపొందవలెను. మనము మనసంతతి పూర్వార్జిత సాంప్రదాయబద్ధముగనే జాతి నిర్మాణము గావించుకొనవలెను. ఇతరుల నుండి అప్పుతీసికొన్నచో మనసొత్తు హరించిపోవును. విదేశాహారమును తిని మనము వృద్ధిచెందలేము. ఇంగ్లీషులోను, తదితర ప్రపంచభాషలలోను గల అమూల్య విషయములను భారతజాతి తన భాషలలోనికి తెచ్చుకొనవలెను. రవీంద్రుని అద్వితీయగ్రంథములలోని సౌందర్యమును గ్రహించుటకు నేను బెంగాలీని నేర్చుకో నక్కరలేదు. మంచి అనువాదముల ద్వారా నాకది లభించగలదు. టాల్‌స్టాయి చిన్నకథల లోని మంచిని గ్రహించుటకు గుజరాతీ బాలబాలికలు రష్యనుభాషను నేర్వనక్కరలేదు. మంచిఅనువాదము లున్న చాలును. ప్రపంచ ఉత్తమ సారస్వతమంతయు, ప్రచురింపబడిన ఒక వారములోపలనే, సరళమగు ఇంగ్లీషులోనికి వచ్చుచుండునని ఆంగ్లేయులు సగర్వముగ చెప్పుకొనుచుందురు. అయినచో షేక్స్పియరు, మిల్టనులఉత్తమ భావములను గ్రహించుటకు నేనింగ్లీషు నేల నేర్చుకోవలెను ?

ఒకరకపు భాషావేత్తలను తయారుచేసి యుంచుకొనుట మంచిది. ప్రపంచభాషలలోని ఉత్తమ సాహిత్యమును పఠించి జాతీయభాషలలోనికి తెచ్చుటయే వారిపని. మన ప్రభువులు మనలను తప్పుడుమార్గమున బెట్టిరి. అభ్యాసము

మనకు కూసువిద్యయై, తప్పును ఒప్పుగ కనబడజేసినది.

భారతీయులను అభారతీయులుగ చేయుచున్న ఈ కృత్రిమ విద్యవలన ప్రజాకోటికి జరుగుచున్న అపచారము నిత్యమును నాకు తేటతెల్లమగుచున్నది. ఆంగ్లవిద్యా పట్టభద్రులైన నామిత్రులు తమలోపలి భావములను చక్కగ వ్యక్తపరచుటకు గిజగిజలాడిపోవుదురు. వారు తమ స్వగృహాలలోనే పరాయివారైనారు. ఇంగ్లీషుపదముల నుపయోగించకుండ వారు ఉపన్యాసమును ముగించలేరు. వారి స్వభాషాపద జాలము అంతలోనే ఆగిపోవును. ఆంగ్లపుస్తకాపేక్ష లేకుండ వారు బ్రతుకలేరు. తరుచు ఇంగ్లీషులోనే వారు జాబులు వ్రాసికొందురు. ఈ చెడు గెంత లోనికి వ్యాపించినదో చూపుటకే ఈమిత్రుల యుదాహరణ నిచ్చితిని. మనలను మనము సంస్కరించుకొనుటకు మనఃపూర్వకముగ ప్రయత్నించవలెను.

మన కాలేజీలనుండి ఒక జగదీశచంద్రబోసు తయారైన చాలదా యని, మిగత పది ఎట్లుపోయిన మనకేమని కొందరి వాదము. ఈ నష్టము అనివార్యమైనచో పై వాదమును నే నంగీకరించగలను. ఈ నష్టము, అప్పుడు ఇప్పుడుకూడ, అనివార్యము కాదని నేను ఋజువుచేసియే యున్నాను. ఇది గాక ఎక్కడనో ఒకబోసు తయారగుచుండుట ఈ వాదమును సమర్థించదు. బోసుకూడ మన ప్రస్తుతవిద్యాఫలము కాదు.

భయంకరములగు ఇబ్బందులను దాటి ఆయనపైకి రాగలిగినాడు. ఆయనవిజ్ఞానము ప్రజానీకమునకు అందుబాటు లోనికి రా జాలక పోయెను. ఇంగ్లీషునేర్చిననేగాని ఎవడుగాని బోసువలె కా జాలడని మన మనుకొందుము. ఇంతకు మించిన మూఢనమ్మిక మరొక టుండబోదు. జపానీయుడెవడును ఇంతగతిలేని స్థితిలో నుండడు.

ఏమైనను సరే! పరభాషద్వారా శిక్షణనిచ్చు పద్ధతి వెంటనే పోవలెను. ప్రాంతీయభాషలకు ఉచితస్థానము లభించవలెను. ఉన్నతవిద్య తాత్కాలికముగ తబ్బిబ్బైపోయినను సహించగలను కాని, దినదినమును పెరిగిపోవుచున్న ఈ నష్టముమాత్రము నాకు దుస్సహము.

దేశభాషల గౌరవమును విలువను వృద్ధి చేయుటకుగాను న్యాయస్థానములలో అవి వాడుకలోనికిరావలెను. రాష్ట్రశాసన సభాకార్యక్రమము కూడ మాతృభాషలోకాని, అది బహుభాషా రాష్ట్రమైనచో ఆ యా భాషలలోగాని జరుగవలెను. శాసనకర్తలు శ్రద్ధచేసినచో తమ రాష్ట్రములోని భాషలను ఒక నెలలోపల అర్థము చేసికొనగలరు. కేంద్రమున హిందూస్థానీకి సర్వప్రాధాన్యత ఉండవలెను.

ఇది విద్వాంసులచే నిర్ధారణ కావలసిన విషయముకాదని నా యుద్దేశ్యము. బాలబాలికల శిక్షణ ఏభాషద్వారా జరుగవలె ననువిషయమును వారు నిర్ణయించలేరు. ప్రతిస్వతంత్ర

దేశమునందును అది నిర్ధారణ అయ్యే వున్నది. బోధనా విషయములను గూడ విద్వజ్జనులు నిర్ణయించలేరు. దేశావసరములపై ఆ విషయ మాధారపడును. జాతియొక్క అభీష్టమును అమలుపరచుటయే వారికిగల కర్తవ్యము. ఈ జాతికి నిజమైన స్వాతంత్ర్యము వచ్చినపుడు శిక్షణ ఏ భాషద్వారా జరుగవలెనను ప్రశ్నకు ఒకే ఒక సమాధానముండును. అప్పుడు విద్వాంసులు దాని ననుసరించి పాఠ్యక్రమమును పాఠపుస్తకములను తయారు చేయుదురు. స్వతంత్రఇండియా విద్యావిధానములో తయారైన వారు స్వదేశావసరములను తీర్పువారై యుందురు— ఇప్పటివలె విదేశ ప్రభువుల అవసరములను తీర్చువారుగ నుండరు. ప్రస్తుతము విద్యావంతులమనబడుచున్న మనము ఈసమస్యతో చెలగాట మాడుచున్నంతకాలము వాంఛనీయము సౌఖ్యప్రదము అయిన స్వాతంత్ర్యమును బడయజాలమని నా భయము. తదేకనిష్ఠతో ఉద్యమించి ఆర్థిక, సాంఘిక రాజకీయదాస్యము నుండి మనము బయటపడవలసి యున్నాము. పోరాటములో ముఖ్యమైన విజయము ఈ ప్రయత్నమునందే యున్నది.

హారిజన్, 9.7-'38.

## పని త్వరితముగ జరుగవలెను

శిక్షణ సాధనమగు భాషను క్రమేణా కాక తక్షణమే

మార్చినచో, మనకు కావలసిన పాఠపుస్తకములు, అధ్యాపకులు అనతికాలములో తయారగుదురు. మనకు పనియే ప్రధానమైనచో ఒక్క సంవత్సరములోగా ఎంతో మార్పు కనబడును. సంస్కృతియొక్క ప్రధానాంశములను పరభాష ద్వారా నేర్చుకొనుటలో ఎంతకాలమును శక్తిని వృథా పరచినామో మనకు స్పష్టమగును. న్యాయస్థానములపై రాష్ట్రప్రభుత్వములకు అధికారము పలుకుబడి యున్నచో, తక్షణమే ప్రభుత్వకార్యాలయాలలోను, న్యాయస్థానాలలోను మాతృభాషలను ప్రవేశపెట్టుటయే విజయమునకు మొదటిమెట్టు. మనకు విశ్వాసమే యున్నచో అతిత్వరలో ఈ సంస్కరణము కావలసియున్నది.

హరిజన్ : 30 7-'౩౮.

## మాతృభాషద్వారా సాంకేతిక విద్య

ఇందుకు విశేషపరిశోధన, ప్రయత్నము కావలసియున్నవను సూచనకు గాంధిజీ అసమ్మతిని వెలిబుచ్చుచు ఇట్లనెను: “ అట్లు వాదించువారికి మనగ్రామసీమల వాడుక భాషలలో జాతీయపదముల నిధులు అణగి యున్నవని తెలియదు. ఈ పదజాలముకొరకు మనము సంస్కృత పారశీక భాషలకు పోనక్కరలేదు. నేను చంపరాణ్‌లో నున్నపుడు అక్కడి గ్రామీణులు ఒక్కవిదేశీయ పదమైనను వాడకుండ, తమ

భావములను సంపూర్ణముగ వ్యక్తపరచగలుగుట చూచితిని. మోటారుకారుకు వారు కల్పించిన "హావాగాడీ" అను మాటను యిందుకు ఉదాహరణగ తీసికోవచ్చును.

హరిజన్ : 18-8-'46

### మాతృభాష ముఖ్యము

నా మాతృభాషలో లోపములున్నను తల్లిపాలవలె నేను దానినే అంటిపెట్టుకొని యుందును. అదే నాకు ప్రాణము నిచ్చు తల్లిపాలు.

హరిజన్ : 25-8-'46

# 15

## జాతీయభాష, లిపి

### హిందీ: భారతజాతీయభాష

విద్యాబోధ ఏ భాషలో జరుగవలె నను ప్రశ్నవలెనే భారతజాతీయ భాషనుగూర్చి కూడ మన మాలోచించవలెను. ఆంగ్లమే మన జాతీయభాష కావలసియున్నచో, దానిని నిర్బంధపాఠముగ బోధించవలసియుండును. ఆంగ్లము మన జాతీయభాష కాగలదా? ఈ ప్రశ్న అడుగుటయే

అజ్ఞానసూచకమని కొందరు పండితదేశాభిమానుల వాదము. వారి యభిప్రాయములో ఇంగ్లీషు యిదివరకే ఆచోటు ఆక్రమించి యున్నది. ఆంగ్లము ఆ స్థానము నాక్రమించవలెనను ఆశను ఇండియా వైస్రాయి వెలిబుచ్చెను. మనపండితుల యుత్సాహము అతని యుత్సాహమును మించియున్నది. ఇంగ్లీషు దినదినాభివృద్ధి నొందుచు భారతగృహముల లోనికి ప్రవేశించి, చివరకు జాతీయభాషగ గౌరవస్థాన మాక్రమించునని వైస్రాయి నమ్మకము. ఈ వాదము స్థూలదృష్టికి సమంజసముగనే కాన్పించును. మన ఆంగ్లవిద్యా పండితుల స్థితినిబట్టి చూడగా ఇంగ్లీషులేనిచో మన వ్యవహారము లన్నియు మూలబడిపోవునను అభిప్రాయము కలుగును. కాని లోతుగ యోచించినచో, ఇంగ్లీషు ఎన్నటికిని భారత జాతీయభాష కాజాలదని, కారాదని తేలును. జాతీయ భాషకు గురుతు లేవి ?

(1) ఉద్యోగులు నేర్చుకొనుట కది సులభముగా నుండవలెను.

(2) మత, రాజ్యాంగ, వర్తకవ్యవహారము లన్నియు ఆభాషతో జరుపుకొనుటకు సాధ్యము కావలెను.

(3) భారతప్రజలలో అధికసంఖ్యాకులు మాట్లాడుకొను భాషయై యుండవలెను.

(4) దేశస్థులందరును సులువుగ నేర్చుకొనగల భాషయై యుండవలెను.

(5) ఈ ప్రశ్ననుగూర్చి యోచించుటలో అప్పటప్పటి తాత్కాలిక పరిస్థితులకు ప్రాధాన్యత ఈయరాదు.

ఆంగ్లభాష పై షరతులలో ఒక్కదానినికూడ నెరవేర్చ జాలదు. ఇందు మొదటి షరతు అసలు చివరిదిగా నుండ వలసినది : కాని అదొక్కటే ఆంగ్లభాషకు వర్తించునట్లు కనబడుచుండును కనుక, దానికి నేను మొదటిస్థాన మిచ్చితిని. కాని కొంచెము యోచించినచో, ఈరోజున ఉద్యోగులకు కూడ ఇంగ్లీషు సులభమైనది కాదు. మన రాజ్యాంగ ప్రణాళికననుసరించి ఆంగ్లఉద్యోగుల సంఖ్య క్రమముగ తగ్గిపోవలసినదే. చివరకు, వైస్రాయితో సహా, బహు కొద్దిమంది ఆంగ్లేయులై యుందురు. ఇప్పటికే అందు అధిక సంఖ్యాకులు భారతీయులు; వారిసంఖ్య ఇంకను వృద్ధికాక తప్పదు.

దేశభాషలలో దేనికంటెను గూడ ఇంగ్లీషు నేర్చుట ఎక్కువ కష్టమని అందరొప్పుకొన్న విషయమే. రెండవ షరతును పరిశీలింతము; దాని ప్రకారము భారతజాతి యంతయు ఇంగ్లీషు నేర్చుకొనగలుగువరకును మతవిషయిక విచారణ నిలిచిపోవలసివచ్చును. ఆంగ్లభాష అంతవిరివిగ ప్రజలలో వ్యాపించుటగూడ అసంభవము.

ఇండియాలో అధికసంఖ్యాకులు ఇంగ్లీషు మాట్లాడరు. కనుక మూడవషరతుకూడ నెరవేరదు.

ఆంగ్లము భారతీయులందరు నేర్చుకోగల సులభమైన భాష కాదు కనుక నాల్గవ షరతుకూడ పోయినది.

ఇక చివరిషరతు : ఈనాడు ఇంగ్లీషుకున్న స్థానము తాత్కాలికము. దేశవ్యవహారములను నడుపుకొనుటకు ఆంగ్లభాషతో పనిలేదని పూర్తిగ నిర్ధారణ యగు చున్నది. సామ్రాజ్య వ్యవహారములకు మాత్రము అది అవసరము. కనుక, అది రాజ్యతంత్రమును నడుపు సామ్రాజ్య భాషగా మాత్రము నిలిచి యుండును. అది వేరు విషయము. అందుకొరకే ఆ భాషాజ్ఞానము అవసరము. ఇంగ్లీషుయెడల మనకు అసూయలేదు. దాని హద్దు అది మించరాదని మాత్రమే మనవాదము. అది రాజ్యతంత్రభాషగా నుండ వలెను కనుక మన మాలవియాజీలను, బెనర్జీలను దానిని నేర్చుకొనమని నిర్బంధింతము. వారుపోయి ఇతర దేశము లందు మన దేశ గౌరవమును చాటుదురని విశ్వసింతము. కాని ఇంగ్లీషు భారతజాతిభాషమాత్రము కాజాలదు. దాని కాస్థానమిచ్చుట యనగా ఒక కృత్రిమ ప్రపంచభాషను ప్రవేశపెట్ట యత్నించుటయే యగును. ఇంగ్లీషు మనజాతీయ భాష కా దగునను తలంపు కూడ పౌరుషహీనమగు పని. కృత్రిమమగు ఏకైక ప్రపంచభాషను తయారుచేయుట కేవల

అజ్ఞానము. పై అయిదుమతరతులను తృప్తి పరచగల భాష యేది ? అది హిందీ ఒక్కటే యని మన మంగీకరించక తప్పదు.

ఉత్తర హిందూస్థానములో హిందువులు దేవనాగరి లోను, మహమ్మదీయులు ఉర్దూలోను వ్రాయుచు మాట్లాడు భాషయే యీ హిందీ. ఈ నా నిర్వచనమునకు అభ్యంతరము తెలుపబడినది. హిందీ ఉర్దూలు వేరువేరుభాషలని వారి వాదనగా తోచును. ఈ వాదన సరికాదు. ఉత్తరహిందూస్థానములో ముస్లిములు, హిందువులు మాట్లాడునది ఒకే భాష. చదువుకొన్న పండితులు ఈ భేదమును కల్పించిరి. హిందూపండితులు దానిని సాంస్కృతికము చేసినారు. కనుక ముసల్మానులకది అర్థము కాదు. లక్నో ముసల్మానులు వారి భాషను హిందువులకర్థముకాని పారశీకముగ చేసినారు. ఒకే భాషయొక్క రెండు అతిరూపము లవి. సామాన్య భాషలో ఈ రెంటికిని స్థానము కనబడదు. నేనుత్తరహిందూస్థానమున హిందూ, ముసల్మానులతో ధారాళముగ కలిసి బ్రతికినాను. నా హిందీజ్ఞానము చాల స్వల్పమైనను వారితో కలయిక నాకెన్నడును కష్టమనిపించలేదు. ఉత్తర దేశభాషను మీరు ఉర్దూఅన్నను హిందీయన్నను. అంతయు ఒకటే, ఉర్దూలిపిలో వ్రాసినదానిని ఉర్దూఅని, దేవనాగరిలో వ్రాయు దానిని హిందీయనియు అందురు.

కనుక ఉన్న భేదమంతయు లిపిలోనే. ప్రస్తుతము ముస్లింపిల్లలు దానిని ఉర్దూలో వ్రాయకతప్పదు. చాలభాగము హిందువులు దేవనాగరిలో వ్రాయుదురు. "చాలభాగమ" న్నాను. ఎందులకన, వేలాది హిందువులు ఉర్దూలిపిని వాడుదురు. అందు కొందరికి నాగరలిపి రానేరాదు. కాని హిందూ, ముస్లింలు ఒకరినొకరు అనుమానించుట మాని సహజీవనము పెంపొందినపుడు, అనుమాన కారణములు తొలగినపుడు ఏ లిపికి ఎక్కువజీవశక్తి ఉండునో అది ఎక్కువగా వాడబడి, అదే జాతీయలిపి కాగలదు. ఈలోగా తమ అర్జీలను ఉర్దూలిపిలో వ్రాయగోరువారికి ఆ స్వేచ్ఛ యుండవలెను. జాతీయ ప్రభుత్వస్థానములలో అట్టి అర్జీలు మన్నింపబడవలెను.

పై అయిదుమరతులను తృప్తిపరచి. హిందీతో పోటీ చేయగల బాష మరొకటేదియు లేదు. హిందీ తరువాతి స్థానము బంగాళీది. అయితే బంగాళీలు హిందీని స్వరాష్ట్రము నందుగాక, బయట వాడుదురు. హిందీవాడు ఎక్కడికి వెళ్లినను తన హిందీ మాట్లాడుటలో ఆశ్చర్యములేదు. హిందూ మతబోధకులు, మహమ్మదీయ మౌల్వీలు తమ తమ ధర్మ ప్రసంగములను హిందీలోను ఉర్దూలోను కూడ చేయుదురు. అక్షరజ్ఞానము లేని ప్రజలకు గూడ అవి అర్థమౌతవి. చదువు రాని గుజరాతీవాడు కూడ ఉత్తరప్రాంతమునకు వెళ్లినపుడు

కొన్ని హిందీమాటల నుపయోగింప ప్రయత్నించును. కాని ఉత్తరాదినుండి గుజరాతుకు వచ్చిన ద్వారపాలకుడు తన యజమానితో నైనను గుజరాతీ మాట్లాడుట కిష్టపడడు. యజమానియే వానితో వచ్చీరాని హిందీలో మాటలాడ వలసియుండును. ద్రవిడప్రాంతమునందుకూడ హిందీవాడకము నేను చూచితిని. ఇంగ్లీషువచ్చినచో మద్రాసులో పని జరిగి పోవుననుమాటలో నిజము లేదు. అక్కడకూడ నేను హిందీని ఫలప్రదముగ ఉపయోగించినాను. రైళ్లలో దక్షిణాది ప్రయాణీకులు నిస్సంకోచముగా హిందీని ఉపయోగించుట నే నెరుగుదును. దేశమంతటను ముస్లిములు ఉర్దూ మాట్లాడుదురని, ప్రతిరాష్ట్రమునందును వారు చాలమందిఉన్నారని మనము తెలిసికొనవలెను. కనుక హిందీ మనజాతీయభాష యగుట విధాయకము. గతకాలములో మనము దానినట్లే ఉపయోగించుకొన్నాము. ఉర్దూ వృద్ధిచెందుట కిదే కారణము. మహమ్మదీయప్రభువులు పర్షియనునుగాని, అరబ్బీనిగాని జాతీయ భాషగా చేయలేకపోయిరి. హిందీవ్యాకరణమును వా రుపయోగించుకొనిరి. కాని ఉర్దూలిపిని పర్షియన్ మాటలను సంభాషణకై వాడుచుండిరి. అయితే,వారు పరభాషను ప్రజా భాషగా చేయలేకపోయిరి. ఇదంతయు ఆంగ్లేయులకు తెలియదు. సిపాయీలకొరకుగాను సైనికసంబంధమైన మాటలు హిందీ, ఉర్దూలనుండి వారు తీసికొనవలసి వచ్చెను.

కనుక హిందీ ఒక్కటే జాతీయభాష కాగలదనుట స్పష్టము. మద్రాసురాష్ట్రమున విద్యావంతులకు కొంత యిబ్బంది కనబడుచున్నది. దక్కను, గుజరాతు, సింధు, బెంగాలుప్రజలకు అది సులభమే. కొద్దినెలలలో తగినంత హిందీపరిచయము కలిగించుకొని, వారు దానిని జాతీయ భాషగా వాడుకొనగలరు. తమిళులవిషయ మట్లుకాదు. వ్యాకరణములోను, భాషయొక్క కట్టుబడిలోను ద్రావిడ భాషలకును సంస్కృతమునకును వ్యత్యాసమున్నది. రెంటికిని పదజాలములో కొంతసామ్య మున్నది. కాని చదువుకొన్న వారికే యీ యిబ్బంది. వారిలోని దేశభక్తినిరగుల్కొల్పి, తగు పరిశ్రమచేసి హిందీ నేర్చుకొనుడని వారిని ప్రోత్సహించుటకు మనకు హక్కున్నది. ఎందుకనగా, ముందు ముందు హిందీ రాజభాషయైనపుడు యితర రాష్ట్రములలో వలెనే మద్రాసురాష్ట్రమునగూడ అది నిర్బంధభాషగా చేయబడును. అప్పుడు మద్రాసుకును యితర రాష్ట్రములకును మధ్య సంబంధము వృద్ధియగును. ఆంగ్లభాష దక్షిణాది ప్రజలలో వ్యాపించియుండ లేదు. హిందీ అతి శీఘ్రముగ వ్యాపించ గలదు.

మహాత్మాగాంధి ఉపన్యాసములు, వ్రాతలు; పేజీలు; 395-99; 20-10-'17

## హిందూస్థానీ ఆవశ్యకత

ప్రయోగాత్మక మగు యీ సంవత్సరమును హిందూస్థానీ నేర్చుకొనుటకు వినియోగింపవలె నని ప్రతివిద్యార్థిని నేను హెచ్చరించినాను. దయతో నాసలహాను పాటింతుమన్నందుకు కలకత్తావిద్యార్థులు వందనీయులు. హిందీ జ్ఞానము లేని బెంగాలు, మద్రాసురాష్ట్రములు యీ విషయమున మిగత భారతమునుండి విడిబడిపోయినవి. మరి యే ఇతర దేశభాషను నేర్చుకొనుటకు బంగాళీలకిష్టముండదు. క్రొత్తగ హిందూస్థానీని నేర్చుకొనలేని కష్టము దక్షిణాదివారి కున్నది. దినమునకు మూడుగంటలసేపు పరిశ్రమచేసినచో బెంగాలీలు రెండు నెలలలోను, దక్షిణాదివారు ఆరు నెలలోను తప్పక హిందూస్థానీ నేర్చుకోగలరు. అదే వ్యవధిలోపల ఆంగ్లము నేర్చుకొనుట అందెవరికిని సాధ్యముకాదు. ఇంగ్లీషు వచ్చినవానికి తనవలె ఇంగ్లీషునేర్చిన బహు కొద్దిమందితోనే సంబంధ మేర్పడును. అట్లుగాక హిందూస్థానీ వచ్చిన వ్యక్తికి దేశము నం దధిక సంఖ్యాకులతో సంబంధము గలుగగలదు. బెంగాలీలు, ద్రావిడులు తగుమాత్రపు హిందీజ్ఞానముతో రాబోవు కాంగ్రెసుకు హాజరు కావలెనని నాకోరిక. అనేకులకు అర్థమగు భాషలో ప్రజలతో మాటలాడగలిగిననే గాని మన జాతీయ మహాసభ ప్రజల కాదర్శప్రాయము కాజాలదు,

ద్రావిడుల యిబ్బంది నే నెరుగుదును. కాని మాతృదేశ ప్రేమతో శ్రమచేయువారికి ఏదియు కష్టమనిపించదు.

యంగ్ ఇండియా : 2-2-'21

## హిందూస్థాని అవసరము

జాతీయపాఠశాలలద్వారా మనము పొందవలసిన నిజమగు విద్యను మనము నిర్లక్ష్యము చేసినాము. కేవలము హిందీయే మాటలాడు మధ్యపరగణాలు, సంయుక్త పరగణాలు, పంజాబు మొదలగు ప్రాంతములకు బంగాళీ,గుజరాతీ,దక్షిణాది యువకులు హిందూస్థానీ రాకుండ, వెళ్లుటయే అసంభవ మగును. కనుకనే ఖాళీసమయములో మీరు హిందూస్థానీ కూడ నేర్చుకొనవలెనని నా కోరిక. ఆంగ్లమును భారతప్రజా భాషగ చేయగలమని మీ రెంతమాత్రమును తలపవద్దు. హిందూస్థానీ 22 కోట్ల భారతప్రజల భాష. వారికి మరే భాషయు రాదు. వారి హృదయములను మీరు చూరగొనవలె నన్నచో హిందూస్థానీ ఒక్కటే మీకున్న భాష.

యంగ్ ఇండియా, 2-2-'21.

## హిందీ జీవవంత మగు భాష

హిందీ సాహిత్యములోను, నేటి హిందీభాషలోను జీవము లేదని యనుచుందురు. కాని తులసీదాసు

రామాయణములోనికి లోతుగ వెళ్లినచో యీనాటిభాషలలో మరి యేగ్రంథమును దానికి సరిరాదను నా భావముతో మీ రేకీభవింతు రనుకొందును. మరి యే యితరగ్రంథమును యీయజాలని విశ్వాసమును ఆశయు నా కాగ్రంథమునుండి లభించినవి. రచనాసౌందర్యము, రూపకాలంకారము, ధర్మోత్సాహముల విషయమున ఎట్టి పరీక్షకైనను, విమర్శకైనను నిలువగల పుస్తకమది.

యంగ్ ఇండియా, 9-2-'21

## హిందూస్థానీ ప్రాంతీయభాషలు

జాతీయభాషయగు హిందూస్థానీ వ్యాప్తివలన ప్రాంతీయ భాషలకు నష్టము కలుగునని కొందరందురు. కేవలము అజ్ఞానముచే కలిగినభయ మిది. ప్రాంతీయభాషల గట్టిపునాది మీదనే జాతీయ భాషాసౌధము నిర్మాణము కావలెను. రెండును పరస్పరపూరకములే కాని ఒకదాని నొకటి తోసిపుచ్చునవి కావు.

హరిజన్, 18-8-'46.

## ఒ కే లి పి

భారతీయులము ఒకే జాతి కావలెనన్నచో అనేక విషయములందు మన మేకస్థులము కావలెను. మన వివిధ

సాంప్రదాయము లందును, ఉప సాంప్రదాయము లందును ప్రవహించుచున్న సంస్కృతి ఒకటే. మన అసమర్థతలు కూడ ఒకటే. మన దుస్థితుల విషయమునకూడ ఒకే పద్ధతి వాంఛనీయమని చూపుటకు నేను ప్రయత్నించుచున్నాను. ప్రాంతీయ భాషలకు ప్రతిబంధకము కాకుండ, వానికితోడు ఏకజాతీయ భాషకూడ ఒకటి మన కావశ్యకము. హిందీ ఉర్దూల కలయికచే ఏర్పడు హిందూస్థానీయే అట్టి జాతీయభాషయని అందరంగీకరించినదే. ఎక్కువగ సంస్కృతపదజాలముతో గాని లేక అధికముగ పర్షియన్, అరబ్బీ మాటలతో గాని అది నిండియుండరాదు. వివిధ ప్రాంతీయ భాషలకు వివిధములగు లిపులుండుట ప్రబల ఆటంకము. ఒకే జాతీయభాష కావలెనను మన స్వప్నము సఫలమగుటకు ప్రాంతీయ భాషలన్నిటికిని ఏకలిపి యుండుట మిక్కిలి వాంఛనీయము.

అనేక లిపు లుండుట అనేకవిధముల ఆటంకము. జ్ఞాన సంపాదనకది గొప్ప అడ్డంకి. ఆర్యసాంప్రదాయిక భాషలలో చాల పోలిక ఉన్నది. ఇన్నిభాషల కిన్నిలిపులు నేర్చుట కెంతోకాలము వృథాయగును. ఒకే లిపియైనచో కష్టము తొలగి అందరి కన్నిభాషలును అందుబాటులో నుండును. ఉదాహరణకు: రవీంద్రనాథ టాగూరుయొక్క నిరుపమాన రచనలు దేవనాగరిలో అచ్చుపడినచో కొద్దిపాటి సంస్కృత

పరిచయమున్నవారి కవి సులువుగ బోధపడగలవు. కాని బెంగాలీలిపి బంగాళేతరులకు తెలియనే తెలియదు. అట్లే దేవనాగరలిపి నెరిగిన బంగాళీలు తులసీదాసు మొదలగు అనేక హిందీరచయితల సాహిత్యములోని అద్భుతమగు ఆత్మ సౌందర్యమును అనుభవించి ఆనందింపగలరు. 1905లో నేను ఇండియాకు తిరిగి వచ్చినపుడు, కలకత్తాలో కాబోలు కార్య స్థానముకల, ఒకానొక సంఘమునుండి నాకు లేఖ వచ్చెను. ఇండియా కంతకును ఒకే భాషాలిపి ఉండవలెనని వారి వాదము. ఆ సంస్థయొక్క కార్యక్రమమేమో నే నెరుగను. అయితే వారి ఆశయము మంచిది. ఈ విషయమున పట్టుదలతో కొద్దిమంది పనిచేసినను ఎంతైన పని జరుగగలదు. అయితే దీనికిని కొన్ని హద్దులున్నవి. దేశభాష లన్నిటికిని ఒక లిపి యేర్పడుట దూరపుఆదర్శముకావచ్చును. సంస్కృత సమ్మిళిత భాషలన్నిటికి, ద్రావిడభాషలతో సహా, ఒకే లిపి యుండుట ఆచరణయోగ్యమగు ఆదర్శము. కాని మనరాష్ట్ర దురభిమానములు పూర్తిగ నశించవలె. ఉదాహరణకు: గుజరాతీలు తమ స్వంతలిపినే అంటిపెట్టుకొని యుండవలె ననుటలో సారములేదు. యావద్భారత దేశాభిమానమును పెంపొందించునదైతేనే రాష్ట్రాభిమానము వాంఛనీయము. అట్లే స్వదేశాభిమానము సర్వప్రపంచ ప్రేమకు దోహద మిచ్చునదికావలె. "ఇండియా లేనేలేదు. గుజరాతే నా సర్వ

స్వము" అను రాష్ట్రాభిమానమును దుర్జనత్వమనవలె. గుజరాతు దేశమునకు మధ్యలోనున్నది కనుకను, నేను గుజరాతీ నగుటచేతను నే నీ యుదాహరణము నిచ్చినాను. గుజరాతులోని ప్రాథమిక విద్యాపద్ధతులను నిర్ణయించిన సంఘము భాగ్యవశమున దేవనాగరి లిపిని నిర్బంధముచేసినారు. ప్రతి గుజరాతీ బాలుడును బాలికయు పాఠశాల వదలునప్పటికి గుజరాతీ, దేవనాగరి లిపులు రెంటిని నేర్చియుండును. కమిటీ వారు దేవనాగరి నొక్క-దానినే నిర్ణయించి యుండినచో యింకను బాగుండెడిది. పురాతన గుజరాతీ గ్రంథములను పఠించి పండిత పరిశోధనలుచేయుటకు కొందరికి గుజరాతీ లిపి తెలిసియుండవలెను. కాని రాష్ట్రమున సామాన్య బాల బాలికలందరు, రెండుకాక, ఒకేలిపిని నేర్చుకొనుటవలన వారిశ్రమయు కాలమునుగూడ కలిసివచ్చును. ఉపయుక్తము లగు మిగతపనులు చేసికొనుట కెంతో అవకాశముండును. మహారాష్ట్రమున విద్యాపద్ధతిని నిర్ణయించిన సంఘము ఇంత కంటె ప్రాజ్ఞులు. వారు దేవనాగరిలిపి మాత్రమే కావలెననిరి. దీనిఫలితముగ మహారాష్ట్రుడు చదువుట విషయములో, తుకారాంగ్రంథమును చదువునంత సులువుగ తులసీదాసు గ్రంథమునుగూడ చదువగలడు గుజరాతీలు, హిందూస్థానీలు కూడ తుకారాం గ్రంథములనంతే సులువుగ చదువ నేర్తురు. బెంగాలుకమిటీ నిర్ణయము మరొక విధముగనుండెను.

ఫలితము దుఃఖకరము. భారతములో అత్యంత సంపత్స మృద్ధమగు బెంగాలీభాషలోని ఉత్కృష్ట రచనలన్నియు, ఉద్దేశపూర్వకముగ నన్నట్లు, రాష్ట్రేతరులకు బోధపడ కుండ చేయబడినట్లే కదా! దేవనాగరి అఖిలభారత లిపి కావలెననుటకు ప్రత్యేక ఋజువు లక్కర లేదు. నేడు ఇండియాలోని అత్యధిక సంఖ్యాకుల లిపి దేవనాగరియగు టయే దానికి ఋజువు.

నా కటక్ సందర్శన సమయమున ఒక ముఖ్యసమస్యను పరిష్కరించవలసినదిగ నేను కోరబడియుండుటచే నాకీ పైయాలోచనలు తట్టినవి. బీహారులో హిందీవారికిని ఉత్కళములో ఓఢ్రులకును మధ్య ఒక తెగ ప్రజలున్నారు. వీరి బిడ్డలకు విద్యగరపవలసిన భాషా సాధనము ఓఢ్రమా, లేక హిందీయా? లేక వారి స్వభాషద్వారానే బోధింప వలసినచో దానికొక క్రొత్తలిపి సృష్టించవద్దా? వారిని ఓఢ్రులలో కలిపివేసికొనవలెనని ఉత్కళమిత్రుల ఆలోచన. అట్లే, బీహారీల యుద్దేశము. వారిని తమలో చేర్చుకోవలె నని. కాని ఆ ప్రజల సంఘపెద్దలు, బీహారీ, ఓఢ్ర భాషలవంటిదే తమభాషకూడ అనిచెప్పి దానికొక లిపి కల్పించవలెనందురు. నే నెరిగిన రెండు సందర్భములలో యిట్లే జరిగెను. వీరికి హిందీభాషను దేవనాగరిలిపిని నేర్పవలసినదని నేను సలహా నిచ్చితిని. ప్రతిచిన్నభాషను శాశ్వతముచేసి, వృద్ధిపరచవలె

నను సంకుచిత దృష్టి జాతీయతకును విశ్వజనీనతకును ప్రతిబంధకము. లిపి లేని, వృద్ధికిరాని చిన్నభాషలు హిందూస్థానీ మహాప్రవాహములో కలసిపోవలెనని నా యభిప్రాయము, ఇట్లు చేయబడు త్యాగము ఔన్నత్య సూచకమే కాని, ఆత్మ వినాశకరము కాదు. సంస్కారమున్న భారతీయులందరికి ఒక జాతీయభాష కావలె ననుకొన్నచో భాషాలిపులను అనవసరము పెరుగనీయరాదు. ఏకజాతీయ భాషను వృద్ధిచేయు ప్రయత్నము లిపితో ప్రారంభము కావలెను. హిందూముస్లింసఖ్య మేరువరకు యీది హిందూ ఇండియాకు వర్తించును. ఈ పనిని నాచేత బెట్టినచో, ప్రతి రాష్ట్రమునందును ఆప్రాంతీయలిపికితోడు దేవనాగరి, ఉర్దూ లిపులను కూడ విధాయకము చేయుదును. వివిధప్రాంతీయ భాషలలోని ప్రధానగ్రంథములను దేవనాగరిలో అచ్చు వేయించి వాటికి సరియైన హిందీ అనువాదముకూడ అందు చేర్చుదును.

యంగ్ ఇండియా : 27-8-'25

## రోమన్ లిపి

ఉర్దూకాక దేవనాగరికాక, రోమన్ లిపిని ప్రవేశపెట్టవలె నను ప్రతిపాదననుగూర్చి ఒకమాట. ఈ యాలోచన ఎంత ఆకర్షణీయముగ కనబడుచున్నను, యిందు చాల ప్రమాద

కరమగు పొరపాటున్నది. నిప్పుమీది పెనమునుండి తప్పి నిప్పులో బడుటవంటి ఆపద అది.

హారిజన్ : 23-3-'47

# 16

## ఇతర భాషలు

సంస్కారముగల ప్రతిభారతీయుడును మాతృభాషతో పాటు, హిందువుడు సంస్కృతమును, మహమ్మదీయుడు అరబ్బీని, పార్శీ పారశీకమును అందరు హిందీని తప్పక నేర్వవలెను. హిందువులు కొందరు అరబ్బీ, పారశీకములను, కొందరు మహమ్మదీయులు, పార్శీలు సంస్కృతమును నేర్వవలసి యుండును. ఉత్తర, పశ్చిమరాష్ట్రముల వారిలో కొందరికి అరవభాష వచ్చియుండవలెను. పారశీక లేక దేవనాగరి లిపిలో వ్రాయబడు హిందీ అఖిలభారత భాష కావలెను. హిందూ ముస్లింల మధ్య సన్నిహిత మైత్రి పెంపొందుటకు రెండులిపులును నేర్చుకొనుట అవసరము.

హింద్ స్వరాజ్ : (1908) పుట 107.

ఏనాడో ఈ మాతృప్రాప్తి సంస్కృతమును నేను నేర్చియుండనిచో మన ధర్మగ్రంథములయం దభిరుచి నాకు చాల

దుర్లభమై యుండును. నా సంస్కృత జ్ఞానమింకను అధికము కాకపోయెను కదా యని చాల విచారపడుచుందును. ప్రతి హిందూబాలుడును, బాలికయు తగుమాత్రము సంస్కృత విద్యను నేర్చియుండవలెనని తరువాత నేను గ్రహించితిని.

ఈ దేశపు ఉన్నత విద్యా ప్రణాళికలలో మాతృభాషకు తోడు హిందీ, సంస్కృతము, పారశీకము, అరబ్బీ, ఆంగ్ల భాషలకు స్థానముండవలెను. ఈ పెద్దజాబితాచూచి ఎవడును భయపడనక్కర లేదు. పరభాషాసాధనము యొక్క బాధ నుండి మనబిడ్డలను తప్పించి విద్యావిధానము నొక క్రమ పద్ధతిని బెట్టినచో, ఈ భాషలను నేర్చుకొనుట బాధకరము కాక సంపూర్ణ సంతోషదాయక మగును. ఒకభాషలో శాస్త్రీయమగు సహేతుకజ్ఞానము కలిగినచో మిగతభాషలు సులు వగును.

స్వీయచరిత్ర (1926) పుట 30.

## ఇంగ్లీషుయొక్క స్థానము

ఇంగ్లీషు అంతర్జాతీయ వ్యాపారభాష; అంతర రాజ్యాంగ వ్యావహారిక భాషకూడ. అందు గొప్ప సాహిత్య మున్నది. పాశ్చాత్యభావ ప్రపంచముతోను, వారి సంస్కృతితోను మన కది పరిచయము కూర్చగలదు. కాని దానియవసరము

మనలో బహు కొద్దిమందికి మాత్రమే. దేశవాణిజ్యము, అంతర్జాతీయ రాచకార్యములు చక్కబెట్టుటకు ఆ కొద్దిమంది చాలును. పాశ్చాత్యుల ఉత్తమ సారస్వతమును భౌతిక విజ్ఞానమును దేశభాషలలోనికి అనువదింపగలరు. ఆంగ్లభాష వలన మనకు కలుగగల న్యాయమైన ఉపయోగ మంతే. కాని ఆభాష నేడు మన హృదయమందలి ప్రియతమస్థానము నాక్రమించి, అటనుండి మనమాతృ భాషలను తోసివేసినది. ఆంగ్లేయులతో మన కేర్పడిన విషమ సంబంధము వలన కృత్రిమముగ ఆభాషనాక్రమించిన స్థానమిది. ఆంగ్లభాషా జ్ఞానము లేకయే భారతీయుల మానసికమహోన్నతి సాధ్యము కావలెనని నే నందును. ఇంగ్లీషు రానివారికి నాగరిక సంఘమునందు ప్రవేశించుట అసంభవమని బిడ్డలకు బోధించుట భారతీయుల అమానుషత్వమును తెలుపును. అది ముఖ్యముగ మన స్త్రీ జాతిని అవమానించుట యగును. ఇట్టి భావనయే చాల దుర్భరము. ఆంగ్లభాషా వ్యామోహము నుండి తప్పించుకొనుట స్వరాజ్యమునకు ముఖ్యసాధనములలో నొకటి.

యంగ్ ఇండియా : 2-2-'21

ఇంగ్లీషు హిందీల మధ్య పోరాటము యించు మించు శాశ్వతమై పోయినది. విద్యార్థి సమావేశములలో నేను

ప్రసంగించినపుడెల్ల వాడు ఇంగ్లీషే కావలె ననుచుండుట నా కాశ్చర్యమును గొల్పెడిది. ఆంగ్లభాషయెడల నాకున్న ప్రేమ మీకు తెలిసినదే, తెలిసియుండవలెను. ప్రజాకోటి మధ్య బ్రతుకుచు వారికి సేవచేయవలసిన భారతీయ విద్యార్థులు ఇంగ్లీషుకంటె హిందీపై ఎక్కువశ్రద్ధ పూనవలె నని నా గట్టి యుద్దేశము. మీరు ఆంగ్లము నేర్చుకొనరాదని నే ననుటలేదు ; తప్పక నేర్చుకొనుడు. కాని నాకు తెలిసినంతవరకు అది కోట్లాది భారతగృహముల భాష కాజాలదు. కొన్ని వేల లేక కొద్దిలక్షలమందితో దాని అవసరము తీరిపోవును. ప్రజానీకములోనికి మాత్రమది వ్యాపించదు:

హరిజన్ : 17-11-'33.

ఆంగ్లభాష దాని స్థానములో అది యున్నంతవరకు నేను హర్షింతును. దానికి కానిస్థానము నది ఆక్రమించినచో నేను దాని ప్రబలశత్రువును. ఇంగ్లీషు యీనాడు ప్రపంచభాషయైనది. అందుచే హైస్కూలులో గాక, విశ్వవిద్యాలయపు చదువులో ఐచ్ఛికపాఠముగా మాత్రమే దానికి రెండవస్థానముండవలెను. అదియు చాలకొద్దిమందికే. లక్షలాది విద్యార్థులకు కాదు. నిర్బంధోచిత ప్రాథమికవిద్యను ప్రవేశపెట్టుటకు అవకాశములు లేని మనము ఇంగ్లీషునేర్పుట కెట్లు

ఏర్పాటు చేయగలము! ఇంగ్లీషుతో పనిలేకయే రష్యా తన విజ్ఞానాభివృద్ధినంతను సాధింపగలిగినది. ఇంగ్లీషు లేనిచో మన బ్రతుకు సాగదనుకొనుట మన భావదాస్యమునకు గుర్తు. అట్టి చచ్చుమతమును నే నెన్నడును ఆమోదింపను.

హరిజన్, 25-8-'46.

ఆ ర వ భా గ ము

# నిర్బంధవిద్య

## 17

## నిర్బంధ విద్య

నిర్బంధవిద్యను ఎన్నడును ప్రతిఘటింపనని నేను చెప్పలేను. నిర్బంధ మెట్టిదైనను నా కసహ్యామే. మద్య నిషేధమునకు బలాత్కార పద్ధతులను ఎట్లు ఆమోదింపనో, అట్లే పిల్లల విద్యలో కూడ నిర్బంధము నేను సహించను. ఉన్న కల్లు, సారా దుకాణములను మూసివేయుట, కొత్తవానిని పెట్టకుండుట మూలమున మద్యపానమును నిరుత్సాహ పరతును. అట్లే విద్యాభివృద్ధికి గల ఆటంకములను తొలగించి, దేశావసరములను తీర్చు ఉచిత పాఠశాలలను స్థాపించుటద్వారా అవిద్యను నిర్మూలింతును. కాని ఇంతవరకును మనము పెద్ద యెత్తున ఉచిత విద్యా ప్రయోగమును చేసియుండలేదు. బిడ్డల తల్లిదండ్రుల కెట్టి ప్రోత్సాహమును ఇచ్చి యుండలేదు. విద్యయొక్క విలువనుగూర్చి మన మింత వరకును తగినంత ప్రచారము చేసి యుండలేదు. యోగ్యులైన ఉపాధ్యాయులు లేరు. కనుక నిర్బంధమునుగూర్చి ఆలోచించు సమయమింకను

రానే లేదు. నిర్బంధ ప్రయోగము చేయబడిన చోట్ల అది జయప్రదమైనట్లు తోచదు. అధిక సంఖ్యాకులు విద్య కావలె నన్నచో నిర్బంధచర్య అవసరమే లేదు. అక్కర లేదన్నచో, నిర్బంధములు చాల హానికరము. అధిక సంఖ్యాకుల ప్రతి ఘటనకు విరుద్ధముగ నిరంకుశ ప్రభువు మాత్రమే శాసనములు చేయును. అధిక సంఖ్యాకుల విద్యకై ప్రభుత్వము కల్పించిన పూర్ణావకాశము లేవి? నూరు సంవత్సరములకు పైగా మనము నిర్బంధముల క్రిందనే పడి నలుగుచున్నాము. సమస్త విషయములందును మన కిష్టములేకుండగనే ప్రభుత్వము మనపై అధికారమును చెలాయించుచున్నది. ఈ జాతి తన పనులను తాను స్వేచ్ఛాపూర్వకముగ చేసికొనవలసిన సమయమే తెంచినది. స్వప్రయత్నము వలన సంస్కరణములు నెరవేరవను నమ్మకము ప్రజలకు అలవాటుచేయుట సంఘ శ్రేయమునకు గొప్ప ఆటంకము. అట్టి నమ్మకములతో బ్రతుకు సంఘమునకు స్వరాజ్యమును బడయగల అర్హతయే లేకుండ బోవును.

ఈనాడు మనకు స్వరాజ్యము వచ్చినచో ప్రాథమిక విద్యావ్యాప్తికి త్రికరణ శుద్ధిగ ఐచ్ఛిక ప్రయత్నములు జరుగవలెను. అవి విఫలమైపోతే నేమో గాని, అంతవరకైనను నిర్బంధ విద్యాపద్ధతిని నే నెదుర్కొనుచునే యుందును. ఒక

విషయము మనము మరువరాదు. ఏబది సంవత్సరముల పూర్వముకంటె ఇప్పుడు చదువులేని వారిసంఖ్య హెచ్చి పోయినది ఇందుకు కారణము తల్లిదండ్రులకు తమబిడ్డల చదువు అక్కర లేకపోవుట కాదు. అంతకు పూర్వము విద్య కీయబడుచుండిన సదవకాశములు అస్వాభావికమగు విదేశీ విధానము కింద అణగి అంతరించిపోవుటయే ఈ దుస్థితికి కారణము.

ఉచితవిద్య అందుబాటులోనికి వచ్చిననుగూడ దానిని అలక్ష్యము చేయునంత బుద్ధిహీనతతో తల్లిదండ్రులు వర్తింతు రనుకొనుట న్యాయము కాదు.

యంగ్ ఇండియా 14-8-'24

ఏడవ భాగము

# ప్రత్యేక వర్గముల విద్య

## 18

### వయోజన విద్య

మనము విచారమును, సిగ్గును పొందవలసిన విషయము అజ్ఞానముకాని నిరక్షరత్వము కాదు. కనుక వయోజన విద్యకు కావలసినది అజ్ఞానమును పోగొట్టుటకొరకు తీవ్రమైన కార్యక్రమము. గ్రామ వయోజనులకు మానసిక వికాసమును కలిగించుటకు గాను, ఎన్నికైన ఉపాధ్యాయులను, చక్కని పాఠ్యక్రమమును జాగరూకతతో నియమించుట అవసరము. వారికి అక్షరజ్ఞానము అక్కర లేదని కాదు. విద్యాసాధనముగ దానికున్న విలువను నేను తగ్గించను. లిపిని, భాషను సులభగ్రాహ్యము చేయుటకు ప్రొఫెసరు లాబాక్, ప్రొఫెసరు భాగవత్ గార్లు శ్రమపడి చేసిన కృషిని నే నభినందింతును. సేగాంకు వచ్చి, అక్కడి స్త్రీ పురుషులకును, పిల్లలకును సులభ పద్ధతులను బోధించమని కోరుచు భాగవత్ గారిని నేను ఆహ్వానించినాను కూడ.

హరిజన్ : 5-6-'37.

ప్రశ్న :— వయోజనవిద్యలోని ముఖ్యోద్దేశము చదువను వ్రాయను నేర్పుటయా, లేక ఉపయుక్తమగు జ్ఞానము నిచ్చుటయా ?

జవాబు:- వయస్సువచ్చి ఏదో ఒకవృత్తి నవలంబించి యున్నవారికి చదువను వ్రాయను నేర్పుట ముఖ్యము. భారతప్రజయొక్క నిరక్షరత్వము సిగ్గుకరమగు ఒకపాప కర్మము. ఇది నిర్మూలనము కావలెను. అయితే విద్యయొక్క ఆది, అంతము అక్షరజ్ఞానము కాదు. దానితోపాటు ఉప యుక్తములగు విషయములు కూడ వారికి బోధింపబడవలెను. కాని ఒకేసారి జోడుగుఱ్ఱముల స్వారిచేయకుండ పురపాలక సంఘములు జాగ్రత వహించవలెను. కానిచో పతనము తప్పదు.

హారిజన్ 18-2-'39.

తిరువన్నైనలూరు గాంధి ప్రచారకసంఘము యొక్క వయోజన విద్యానివేదిక నాకు పంపబడినది. అక్కడ చదివిన వయోజనులసంఖ్య 197. 'వీరికి వచ్చినచదువు మరువకుండ చేయుటయెట్లు?' అన్నది ఒకసమస్య యైనది. నివేదికలో ఇంకను యిట్లున్నది : "కొంతవరకు చదివినవారు తిరిగివచ్చి, ఆ పాఠములనే మరొకసారి చదివించమని ఉపాధ్యాయుల నడుగుచున్నారు. వచ్చిన అక్షరములనే వారు మరచిపోయిరి,

మరచిపోకుండ చేయుటకు ఉపాధ్యాయులు తీవ్రప్రయత్నము చేయుచున్నారు.'' కాని ఉపాధ్యాయులంత బాధ నొంద వలసిన పనిలేదు. తాత్కాలిక చదువులు అప్పటి కప్పుడే మరపుకు వచ్చును. గ్రామస్థుల కిచ్చువిద్యకును వారి నిత్య జీవిత కార్యములకును సంబంధ ముండవలెను. అప్పుడే ఆ చదువు నిలుచును. పట్టి అక్షరజ్ఞానము నిలువదు. దానిని నిర్బంధముగ వారిపై రుద్దరాదు. దేనికైనను వారిలో అభిరుచి యుండవలెను. ఈ నాటి చదువులపద్ధతి వారి కక్కర లేనిది, రుచింపనిది. గ్రామవాసులకు గ్రామగణితము, గ్రామ భూగోళము, గ్రామచరిత్ర వారు ప్రతిదినమును ఉప యోగించుకొనగల సాహిత్యజ్ఞానము కావలెను. ఈ జ్ఞానమును వారు తమదిగ చేసికొని క్రమాభివృద్ధి నొంద గలరు. వారి నిత్యజీవితమున కుపయోగపడని పుస్తకములతో వారికి పనియుండదు.

హరిజన్, 22-6-'40.

# 19

## స్త్రీ విద్య

స్త్రీ పురుషు లిరువురి హోదా సమానమే. అయినను వారిలో భేదమున్నది. వారి జత నిరుపమానమైనది. అది పరస్పరపూరకము. ఇందొకరు లేనిచో రెండవవారి ఉనికి దురూహ్యము. ఒకరిసహకార మొకరికి అత్యవసరము. ఇందు ఏ యొకరిస్థానమునకు భంగము వాటిల్లినను ఇరువురి పతనము తథ్యము. స్త్రీ విద్యాప్రణాళికను తయారు చేయుటలో పై ముఖ్యవిషయమును జ్ఞప్తియం దుంచుకొనవలెను. బయటి వ్యవహారములలో అగ్రస్థానము పురుషునిది కనుక, అందు పురుషునికి అధికజ్ఞాన ముండుట సహజము. గృహజీవనము పూర్తిగ స్త్రీ యొక్క క్షేత్రము. ఇంటి వ్యవహారములలోను, బిడ్డలను పెంచి వారికి విద్యాబుద్ధులు గరపుటలోను స్త్రీకెక్కువ అనుభవ జ్ఞానముండును. పరస్పరసంబంధము లేని రెండు గదులుగ జ్ఞానమును విడదీసి, యిది వీరిదని అది వారిదని అనుటకాదు. అందొకరు కొన్ని విద్యలకు అనర్హులనుటయు కాదు. కాని పై ప్రధానసూత్రమును శ్రద్ధతో గమనించి విద్యా విధానమును నిర్ణయించనిచో స్త్రీ పురుషుల జీవితము పూర్ణవికాసము నొందదు.

మహాత్మాగాంధి ఉపన్యాసములు, వ్రాతలు. పు॥ 425, 426, 20-2-'18.

# స్త్రీలు—ఆంగ్లవిద్య

స్త్రీలు జీవనోపాధికై పాటు పడవలెనని, వ్యాపారాదులు చేసికొనవలెనని నా సిద్ధాంతము కాదు. కొలదిమంది స్త్రీలకు ఆంగ్లవిద్య కావలసినచో, యధేచ్ఛగ వారు పురుషుల విద్యాలయములలో చేరి చదువవచ్చును. కాని స్త్రీలకొరకు ఉద్దేశింపబడిన పాఠశాలలలో ఆంగ్లవిద్యను ప్రవేశపెట్టుట యనగా మన అనాథత్వము నింకను పొడిగించుకొనుటయే. ఆంగ్లసారస్వత ధనాగారమును పురుషులవలె స్త్రీలుకూడ అనుభవించుటకు పూర్ణావకాశ మీయబడవలెనని కొందరు వ్రాయుట, చెప్పుట నే నెరుగుదును. అట్టి యభిప్రాయములో కొంతభ్రమ యున్నదని నా వినయపూర్వక విజ్ఞప్తి. ఈ యైశ్వర్యమును పురుషులకు మాత్రమే కట్టబెట్టి, స్త్రీలకు లేకుండచేయు ఉద్దేశ్య మెవరికిని లేదు. వారికి సాహిత్యమునం దభిరుచి యున్నచో, ప్రపంచసారస్వతము లన్నిటిని పఠించవచ్చును. వద్దనువా రుండరు. కాని యావత్తు సంఘము యొక్క అవసరములను దృష్టియం దుంచుకొని విద్యాపద్ధతిని నిర్ణయించినపుడు కొద్దిమంది యొక్క ప్రత్యేకరుచులను తృప్తిపరచుట కష్టము.

మహాత్మాగాంధి ఉపన్యాసములు, వ్రాతలు : పు॥ 426, 4[illegible]; 20-2-'18.

## స్త్రీలలో నిరక్షరత్వము

స్త్రీలలో చదువు లేనిదానికి కారణము, పురుషులలో వలె స్తబ్ధత్వము, సోమరితనము మాత్రమే కాదు. ఆది నుండియు సంఘమునందు స్త్రీల కీయబడిన అన్యాయపు అధమ స్థానమే యిందుకు ప్రబల కారణము. పురుషుడామెను తనకు సహాయురాలునుగాను, అర్ధాంగిగను పరిగణించుటకు మారుగా యింటి దాసిగాను, తనకు సుఖమునుగూర్చు పనిముట్టుగాను చేసినాడు. ఇందుచే సంఘమునకు పక్షవాతము పట్టినది. స్త్రీని జాతికి మాతగా పరిగణించుట న్యాయము. మన మామెకు చేసిన అపచారమును సరిదిద్దుకొనుటవలన ఉభయత్ర మనకుగల కర్తవ్యమును నెరవేర్చిన వారమగుదుము.

హరిజన్ : 18-2-'39.

# 20

## హ రి జ న వి ద్య

హరిజన విద్య అన్నిటిలోను కష్టతమమైనది. హరిజనేతర బాలబాలికలకు క్రమశిక్షణ ఏకొలదిగనో గృహమునందు లభించును. సంఘమునుండి నెట్టివేయబడుటచే హరిజన

పిల్లలకు ఆమాత్రమును ఉండదు. సాధ్యమైనంత త్వరలోనే, ఏదో ఒకనాడు ప్రాథమికపాఠశాల లన్నిటిలో హరిజనుల బిడ్డలకు ప్రవేశమీాయబడును. అప్పుడు ఇబ్బంది కలుగకుండ ఈ లోగా వారికి కొంత ప్రారంభశిక్షణ అవసరము. ఇండియా అంతటను హరిజన సేవకసంఘమువారు నెలకొల్పిన హరిజన పాఠశాలలలో ఈ ప్రారంభశిక్షణ జరుగవలసియున్నది, మంచిఅలవాట్లు, మంచి ఉచ్చారణతోగూడిన భాష, మంచి నడవడి యీా శిక్షణలోని ముఖ్య విషయములు. సరిగా కూర్చుండుట, దుస్తులు ధరించుట కూడ, వా రెరుగరు. వారి కండ్లు, చెవులు, పండ్లు, జుట్టు, గోళ్లు, ముక్కు తరచు కల్మషముతో నిండియుండును. చాలమంది స్నానము చేయుటయే యెరుగరు. 1915 లో తమిళనాడులోని ట్రాన్క్వెబారులో నే నొక హరిజనబాలుని చేరదీసి, అప్పటిలో ఆశ్రమస్థానమగు కొచ్రాబ్ కు తీసికొని వెళ్లితిని. వానికి క్షురకర్మ, స్నానముచేయించి, చిన్నకట్టుపంచె, చొక్కా, టోపీ యిచ్చితిని. అంతట్లో వాని రూపము మారిపోయెను, విద్యావాసనలున్న గృహములోని బాలునికిని వానికిని మధ్య భేదమే కనపడలేదు. వాని తల, కండ్లు, చెవులు, ముక్కు శుభ్రము చేయబడెను. మాలిన్యముతో నిండినగోళ్లు తీసి వేయబడెను. మట్టిగొట్టినపాదములు బాగుగ తోమి శుభ్ర

పరచబడెను. హరిజనబడిపిల్లలకు అవసరమునుబట్టి ప్రతి దినమును యీ సంస్కారము జరుగవలెను. మొదటి మూడు నెలలు పరిశుభ్రతను గూర్చిన శిక్షణయే జరుగవలెను. చక్కగ తినుట యెట్లోవారికి నేర్పవలెను. అయితే నా ఒరిస్సాపద యాత్రలో నే నొకదృశ్యమును చూచితిని. అక్కడక్కడ హరిజనపిల్లలు, పెద్దలు భోజనము చేయుటలో చాలశుభ్రత కనుపించెను. ఇతరులు తినుపద్ధతి చాల అసహ్యముగ నుండెను. పదార్థముల నిటునటు చిమ్మి అమాంగల్యముగ విస్తళ్లువదలి వ్రేళ్ల నుండి ద్రవ పదార్థము కార్చుచు లేచుచుండిరి. హరిజనులు తమ విస్తళ్లలో ఒక్క మెతుకైనను దిగబెట్టలేదు. వారు ప్రతిముద్దను మింగిన తరువాత వ్రేళ్లనుకూడ శుభ్రముగ నాకివేసిరి. అన్నిచోట్ల హరిజనపిల్లలందరు ఇంతశుభ్రముగ తిందురని చెప్పలేము.

హరిజనపాఠశాల లన్నిటిలో యిట్టి ప్రారంభశిక్షణ నీయవలసినచో, ఉపాధ్యాయులకు వలయు సూచన లిచ్చుచు అన్ని దేశభాషలలోను కరపత్రములు పంచిపెట్టవలెను. ఇనస్పెక్టర్లు పరీక్షా సమయములలో ముఖ్యముగ ఈ విషయమున విద్యార్థులను ఉపాధ్యాయులనుగూడ పరీక్షించి పూర్తి నివేదికలు పంపు యేర్పాటుండవలెను.

సర్వసమర్ధులగు క్రొత్తఉపాధ్యాయుల నెన్నుకొనుటయు, ఇపుడున్న వారికి తగుశిక్షణనిచ్చి పనిచేయించుటయు ఈకార్యక్రమములో భాగమే. హరిజనసేవకసంఘము తన అధీనము నందుంచబడిన వేలాది హరిజనపిల్లల విషయమున యిట్టి బాధ్యత నెరవేర్చవలసియున్నది.

హరిజన్ : 18-5-'35.

# ఎనిమిదవ భాగము

# ఉన్నత విద్య

## 21

### జాతీయ విశ్వవిద్యాలయములు

ఈ జాతీయ విశ్వవిద్యాలయము * బ్రిటిషర్ల అక్రమముల ఖండనకును, స్వజాతిగౌరవ రక్షణకును చిహ్నముగ నిలిచి యున్నది. ఇది చిరస్థాయిగ నిలువగలదు. అఖండ భారతముయొక్క జాతీయాదర్శములే దీనికి ప్రాణము. హిందువుల ధర్మమును, మహమ్మదీయుల ఇస్లామును కూడ ఈ సంస్థయొక్క మతము. దేశభాషలు నిష్కారణముగ నశించిపోకుండ రక్షించి, వాటిని జాతీయాభ్యుదయమునకును, జాతీయ సంస్కృతికిని ముఖ్య సాధనములుగ జేయ సంకల్పించినది. సంపూర్ణమగు జీవితశిక్షణకు పాశ్చాత్య భౌతికవిజ్ఞాన శాస్త్రపఠన మెంత అవసరమో, అంతకుమించి ఆసియాఖండసంస్కృతుల సమన్వయజ్ఞానము అత్యంతావశ్యక మని దీని యుద్దేశము. సంస్కృత, అరబ్బీ, పారశీక, పాలీ, మాగధి భాషలలోని సాంస్కృతిక పెన్నిధు లన్నిటిని ఆమూ

---

* గుజరాతువిద్యాపీఠము, అహమ్మదాబాదు.

లాగ్రముగ తరచి; యీ జాతికి బలమెచటినుండి రాగలదో కనుగొనవలెను. ప్రాచీనసంస్కృతులను పూరక అనుక రించుచు, వాటిపేరు చెప్పుకొనుచు బ్రతుకవలెనని కాదు దీని యుద్దేశము. వెనుకటి సాంప్రదాయములతో ఆధునిక అనుభవ జ్ఞానమును సమన్వయించుకొని ఒక నూతన సంస్కృ తిని నిర్మింపవలెనని దీని ఆశయము. వివిధ సంస్కృతులు ఇండియాలో స్థిరనివాస మేర్పరచుకొని తమ ప్రభావమును భారతజాతీయ జీవనముపై బరపినవి. అట్లే ఈ భూమి మహాత్మ్యము వానిపై గూడ ప్రసరించినది. ఇట్లువివిధ సంస్కృతుల సమరస పరచుటయే యీ విశ్వవిద్యాలయా దర్శము. అయితే ఈ సామరస్యము దేశీయమగు పద్ధతినే జరుగవలెను. ఇందు ప్రతియొక్క సంస్కృతికిని దాని ఉచిత గౌరవస్థాన ముండును. అమెరికన్ పద్ధతిలో వలె బలమైన నాగరికత విజృంభించి మిగతవానిని మింగివేయదు. అక్కడ యుద్దేశముసామరస్యము కాదు; కృత్రిమమగు బలాత్కారపు ఐక్యత. అందుచేతనే ఇక్కడి విద్యార్థులు ఇండియామతము లన్నిటిని పఠింపవలెనని ఈ విద్యాలయోద్దేశము. ఇట్లు హిందువులకు ఖురాన్ చదువు అవకాశమును, ముస్లిములకు హిందూధర్మశాస్త్రవిషయములను తెలిసికొను అవకాశమును ఉండును. ఇక నీ విద్యాలయము బహిష్కరించున దేదైన ఉన్నదాయనిన, ఏ తెగవారిని గాని శాశ్వతముగ అస్పృశ్యు

లను చేయు దుష్టమతమును మాత్రము ఇది బహిష్కరించును. సంస్కృత, హిందీ, ఉర్దూభాషల సహజ సమన్వయ రూపమగు హిందూస్థానీ భాషాపఠనము ఇక్కడ నిర్బంధము చేయబడినది. మతము, రాజ్యాంగము, చరిత్రలద్వారా మాత్రమేగాక వృత్తిని కల్పించు పరిశ్రమలద్వారా కూడ స్వాతంత్ర్య తత్వము విద్యార్థుల కిచట బోధింపబడును. పరిశ్రమలే దేశజనులకు ఆర్థిక స్వాతంత్ర్యము నిచ్చి, ఆత్మగౌరవమును నిలుపు వెన్నెముకగా నిలువగలవు. అనేక పరిసర గ్రామములలో ప్రాథశాలలను నెలకొల్పి సాధ్యమైనంత త్వరితముగ ప్రజలలో విద్యాగంధమును వ్యాపింపజేయవలెనని ఈ విద్యాలయ మాశించుచున్నది. గుజరాతీ భాష ద్వారా విద్య నభ్యసింపజేయుటచే ఈ పని చాల సులువగును. నేడు చదివిన వారికి చదువని వారికి మధ్య నేర్పడి యున్న అఖాతము అనతికాలములో పూడిపోగలదు. నాగరికులకు పారిశ్రామిక విద్యను, పారిశ్రామికులకు గ్రంథ పఠనమును నేర్పుటవలన ఆర్థిక అసమానతయు, దానివలన కలుగు సాంఘిక అసంతుష్టియు చాలవరకు తగ్గును. విదేశీయుల ఆధిపత్యమొకటి, జీవితహోదాలను గూర్చి వారు కల్పించిన కృత్రిమ నిర్వచనమొకటి—ఈ రెండును ప్రభుత్వ విశ్వ విద్యాలయములను పట్టినదోషములు. ఈ విద్యాపీఠము

ప్రభుత్వముతో సహాయ నిరాకరణము చేసి తత్ఫలితముగ తన విధానమునుండి యీ రెండుచెడుగులను తీసివేసినది. ప్రభుత్వము జాతీయమగువరకు ఈ విద్యాపీఠ స్థాపకులు, అభిమానులు ఈ నిశ్చయమును వదలకుండ పనిచేసినచో జాతీయాదర్శములను, ఆవశ్యకతలను స్పష్టముగ తెలిసికొనుట కది సహాయపడును.

యంగ్ ఇండియా; 17-11-'20.

## కాలేజీవిద్య- ప్రభుత్వవ్యయముతో కాదు

కాలేజీవిద్య పూర్తిగ, మారవలెనని, దేశావసరములను తీర్చుటకే అది ఉపయోగించవలెనని నా యభిప్రాయము. మెకానికల్ ఇంజనీర్లకు, తదితర ఇంజనీర్లకు పట్టాలియ్య బడును, తమకు కావలసిన పట్టభద్రుల శిక్షణకగు వ్యయమును ఆయా పారిశ్రామికసంస్థలే భరించవలెను. ఉదాహరణకు : 'తాతా' కంపెనీవారు ఇంజనీర్ల తయారుకుగాను, ప్రభుత్వ అజమాయిషీకింద, ఒక కాలేజీని నడుపుదురు. ఇట్లే మిల్లు సంఘములు కూడి తమ కవసరమగు పట్టభద్రులకై ఒక కాలేజీని నెలకొల్పుదురు.

మిగత పరిశ్రమలకు కూడ ఇట్టి యేర్పాట్లే జరుగవలెను. వర్తకశాలలకు ప్రత్యేక కాలేజీ లుండును. ఇక మిగిలినవి

కళలు, వైద్యము, వ్యవసాయము. ఈ నాటి కళాశాల లెన్నో స్వయంపోషకములై యున్నవి. కనుక ప్రభుత్వము వేరుగ కళాశాలలను నడుప బనిలేదు. వైద్య విద్యాలయములు యోగ్యతా పత్రములు పొందిన ఆసుపత్రులకు చేర్చబడును. ఆసుపత్రులు ధనికులకు ఎక్కువ అవసరము కనుక వారే విరాళము లిచ్చి వైద్య విద్యాలయములను పోషింపవచ్చును. వ్యవసాయ కళాశాలల పేరు సార్థకము కావలెనన్నచో అవి స్వయంపోషకములుగ నుండవలెను. కొందరు వ్యవసాయపట్టభద్రులను గూర్చి నాకు బాధకరమైన అనుభవము కలదు. వారి జ్ఞానము లోతులేని, అనుభవములేని పైపై వ్యాపారము. స్వయంపోషకములగు వ్యవసాయ "ఫారము"లలో దేశముల కవసరమైన పనిని సకాలములో వారు నేర్చుకొని యుండినచో, తరువాత ఉద్యోగకాలములో అనుభవములేక తమ యజమానులను బాధపెట్టు అవసర ముండదు.

హరిజన్ : 31-7-'37.

## ఉన్నత విద్య

వివిధ పరిశ్రమలకు, సాంకేతికకళలకు, సాహిత్యమునకు, లలితకళలకు సంబంధించి దేశావసరవములను తీర్చు ఏ యున్నతవిద్య కాని ప్రైవేటుసంస్థలకు విడిచి పెట్టబడవలెను.

రాష్ట్ర విశ్వవిద్యాలయములు కేవలము పరీక్షలను జరుపుచు, పరీక్షరుసుములద్వారా వచ్చు ఆదాయముతో స్వయంపోషకములు కావలెను.

విశ్వవిద్యాలయములు మొత్తము విద్యాశాఖపై పర్యవేక్షణచేయుచు, వివిధ శాఖలలోని పాఠ్యక్రమమును నిర్ణయించి అమలు పరచును. విశ్వవిద్యాలయము యొక్క అనుమతి లేనిదే ఏ ప్రైవేటువిద్యాలయములు గాని స్థాపింపబడరాదు. నమ్మకస్థులని, సమర్థులని ఋజువుకాబడిన పెద్దలతో ఏర్పడిన ఏ సంస్థకైనను విశ్వవిద్యాలయాధికార పత్రమీయబడవలెను. అయితే, యిందువలన ప్రభుత్వమునకెట్టి వ్యయముగూడ కారాదు. కేంద్రము నందలి విద్యాశాఖ ఖర్చుమాత్రము ప్రభుత్వము భరించును.

ప్రభుత్వకార్యముల కవసరమగు విద్యాకేంద్రములను నడుపుకొనవలసిన బాధ్యత ప్రభుత్వము మీదనే యుండును.

హరిజన్ : 2-10-'37.

1. ప్రపంచమున నేర్వదగిన ఎంతటి మహోన్నత విద్యకైనను నేను ప్రతికూలుడను కాను.

2. అట్టివిద్య నిర్దిష్టముగ ప్రభుత్వమున కుపయోగపడుచోట దాని ఖర్చు ప్రభుత్వమే భరించును.

3. ఎట్టి యున్నత విద్యగాని ప్రభుత్వసాధారణాదాయము నుండి పోషింపబడుటకు నేను వ్యతిరేకిని.

4. కళాశిక్షణ అనుపేరిట మన కాలేజీలలో చెప్పబడునది చాలవరకు వృధాకాలక్షేపము. చదివినవారిని నిరుద్యోగులుగ చేయుటయే దాని ఫలితము. ఈ చదువుల నలుగుడు వలన విద్యార్థుల శారీరక మానసికారోగ్యము నశించిపోవుట మరొక ఫలితము.

5. విదేశభాషలద్వారా పాఠములు చెప్పుపద్ధతి మానసికముగను, నైతికముగను ఈ జాతికి అపారమగు హాని చేసినది. మన కాలమున కింత దగ్గరలో మనముండుట చేత మనమెంత పెద్దనష్టము పాలైతిమో నిర్ణయింప లేకున్నాము. ఈ విద్యకు బలియైపోయిన వారమును, దాని నష్టమును నిర్ణయింప వలసిన వారమును మనమే అయితిమి—ఎంత అసందర్భ స్థితి !

ఉన్నతవిద్యకు నేను శత్రువును కాను. కాని, ఈ దేశమందది గరపబడుచున్న విధానమునకు మాత్రము శత్రువునే. నా ప్రణాళిక ప్రకారము ఇంకను మంచి గ్రంథాలయములు, ప్రయోగశాలలు, పరిశోధకసంస్థలు హెచ్చుసంఖ్యలో నుండగలవు. పలువురు రసాయనికులు, ఇంజనీర్లు, తదితర శాస్త్రనిపుణులు బయలుదేరి జాతి అభివృద్ధికి పాటుపడుదురు, క్రమశః తమహక్కులను, అవసరములను గుర్తించుకొనుచున్న

ప్రజాశ్రేణికి సేవ చేయుదురు. ఈ నిపుణులందరు పర భాషను గాక ప్రజలభాషను మాట్లాడుదురు. వారు సంపాదించు విజ్ఞానమంతయు ప్రజలందరిసొత్తు అగును. వారి పనియంతయు వట్టి అనుకరణముగాక స్వబుద్ధితో యోచించి చేయునదై యుండును. దాని ఫలము సరిసమానముగ అందరికి చెందును.

హరిజన్ : 9-7-'38

ఉన్నతవిద్యను గూర్చిన నా వ్యాసముపై ఒక మాజీ ప్రొఫెసరు ఒక పెద్దలేఖను వ్రాసినాడు. దానిలోని కొన్ని ముఖ్యాంశములివి :

"ప్రభుత్వ సాధారణాదాయమును గూర్చిన మీ మూడవ నిశ్చితాభిప్రాయము, ఉన్నత విద్యకున్న హక్కులు, విశ్వ విద్యాలయముల స్వయంపోషకత్వము— వీనియందు నాకు నమ్మకము కుదరలేదు. వృద్ధికి రావలసిన ఏ దేశమునందుగాని అన్ని విధములగు విజ్ఞాన సంపాదనకును పూర్ణావకాశము లుండవలెను. రసాయనిక శాస్త్రము, వైద్యము, ఇంజనీరింగు మాత్రమేకాదు; సారస్వతము, తత్వ శాస్త్రము, చరిత్ర, సాంఘికశాస్త్రము మున్నగునవన్నియు అవసరములే. ఈ విద్యలకు వలయు అన్ని సౌకర్యములును ప్రభుత్వపోషణ లేకుండ కలుగనేరవు. ఐచ్ఛికమగు బయటి

సహాయముపై ఆధారపడు దేశము వెనుకబడి నష్టపడును. దానికి స్వేచ్ఛగాని, స్వాతంత్ర్యమును నిలబెట్టుకొను శక్తిగాని ఉండదు. ఉన్నత విద్యాశాఖలపై ప్రభుత్వాధిపత్యమును, నిరీక్షణయు ఉండితీరవలెను. ఐచ్ఛిక ప్రయత్నములు కూడ ఉండవలెను. మనకును న్యూఫీల్డులు, రాక్ ఫెల్లర్లు కావలెను. కాని ప్రభుత్వము తటస్థుడగు ప్రేక్షకునిగ నుండిపోరాదు. విద్యావిధాన నిర్మాణమునకు దానిని నడపుటకు,, సహాయ పడుటకు ప్రభుత్వము పూనుకొనవలెను. ఈ విషయమును మీ రింకను స్పష్టముగ వివరింతురని కోరుచున్నాను.

"మీ ప్రణాళిక ననుసరించి ఎక్కువ సంఖ్యలో మంచి గ్రంథాలయము లుండునని మీ వ్యాసమునం దున్నది. మీ ప్రణాళిక' యేమో మీ వ్యాసములో కనబడుటలేదు. అందు మంచి గ్రంథాలయములు, పరిశోధనాలయములు అధికముగ ఎట్లుండగలవో తెలియదు. అట్టివి తప్పక పోషింప బడవలెననియే నా యభిప్రాయము. కాని విరాళదాతలు, స్వచ్ఛందసేవక సంఘములు ముందుకు రానంతవరకు ప్రభుత్వమునకీ బాధ్యత తప్పదు."

నా రెండవ యభిప్రాయము లోని 'నిర్దిష్టమగు ఉప యోగము' అను పదమునకు విశాలార్థము నిచ్చినచో నా వ్యాసములోని విషయమంతయు సుస్పష్టము కాగలదు. జ్ఞానశూన్యులగు నిరుపేదలతో నిండిన ఇండియాను గూర్చి

కాదు నేనుచేసిన భావన. తన విశిష్ట శక్తిసామర్థ్యములకు తగినమార్గమును బట్టి నిత్యమును పురోగమించు ఇండియాను గూర్చి నే నన్నది. అవసానదశయందున్న పాశ్చాత్య నాగరికతయొక్క మూడవ, అథవా మొదటితరగతి నకలుగా ఇండియాను నే నిచట చిత్రించుట లేదు. నా స్వప్నము నిజమై, మనయేడులక్షల గ్రామాలు స్వయం సమృద్ధములగు ప్రజారాజ్యములుగ విలసిల్లినచో అందు నిరక్షరత్వముండదు, ఎవరును పనిదొరకని సోమరులుగ నుండరు. ప్రతివానికిని ఉపయుక్త మగు ఏదోయొక్క వృత్తి యుండును. పుష్టినిచ్చు తిండి, కావలసినంత ఖాదీవస్త్రము. గాలి వెలుతురు లున్న నివాసగృహము, ఆరోగ్యము, పారిశుధ్యము ఉండును. అట్టి రాజ్యమున కెన్నో అవసరములుండును. వాటి నన్నిటిని సమర్థతతో తీర్చుకొనని ప్రభుత్వము స్తంభించి నిరుపయోగ మగును. విలేఖరి ఉదహరించినట్లు ప్రభుత్వము యావత్తు విద్యావ్యయము భరించుటయే గాక మరెన్నో బాధ్యతలు కూడ మోయవలసి యుండును. ఇన్ని యవసరములు రాజ్యమున కున్నపుడు తగినన్ని గ్రంథాలయములను కూడ అది నెలకొల్పును.

అయితే నా యుద్దేశములో, ఈ నిరర్థకపు బి.యే., ఎం. యే లను పరంపరగా తయారు చేయు పని మాత్రము ప్రభుత్వము పెట్టుకొనరాదు. పుస్తకములను వల్లించుట

తోనే పాపము వారిమెదడు నిస్సారమై పోవును. ఆంగ్లేయుల వలె ఆంగ్లమును వ్రాయుట, మాట్లాడుట నేర్పవలె నను నిరర్థక ప్రయాసతో వారి తెలివి బండపారిపోవును. ఇందు అధికసంఖ్యాకు పని యుండదు, ఉద్యోగముండదు. ఒక వేళ దొరికినను, సాధారణముగ అది గుమస్తా పనియే. వారు హైస్కూళ్లలోను, కాలేజీలలోను నేర్చిన 12 సం॥ల చదువు ఈ గుమాస్తాపనిలో వారి కేమాత్రమును ఉపయోగించదు.

విశ్వవిద్యాలయ శిక్షణను రాజ్యము వినియోగపరచు కొన్నచో విద్య స్వయంపోషకము కాగలదు. జాతికిగాని, వ్యక్తికిగాని ఉపయోగించని శిక్షణకు డబ్బు వ్యయపరచుట నేరమే యగును. జాతి కంతకును ఉపకరించని వ్యక్తిలాభము ఉండరాదని నా యుద్దేశము. నేటి ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నతవిద్యలో నిజాయితీ లేదని నా విమర్శకులలో చాల మంది అంగీకరించి యుండుటచే రాజ్యమున కది ఉపయోగ పడజాలదని ధృవమగుచున్నది. విద్యకు ప్రత్యక్షదేశ పరి స్థితులతో సూటిగ సంబంధముండి, పూర్తిగ మాతృభాషలో అది గరపబడినప్పుడు నేను దానికి వ్యతిరేకించవలసిన పని యుండదు. విద్యలో నిజాయితీ అనగా జాతీయ అవసరములను తీర్చ గలుగుటయే. అప్పుడు దాని వ్యయము రాజ్యమే భరించును. అట్టి సుసమయము వచ్చినను గూడ ఐచ్ఛిక విరాళములతో నడుపబడు విద్యా సంస్థలుకూడ అనేకము

లుండును. వాని వలన రాజ్యమునకు లాభ ముండవచ్చును, లేకపోవచ్చును. ఇప్పుడు ఇండియాలో విద్య యనబడునది ఈ తరగతిలోనికి వచ్చును. కనుక దాని వ్యయము ప్రభుత్వాదాయము నుండి తీయబడరాదని నా యభిప్రాయము.

హరిజన్: 30-7-'38.

## విశ్వవిద్యాలయ విద్యను సంస్కరించి జాతీయము చేయవలెను

పూనాలో జరిగిన విద్యామంత్రుల సమావేశములో గాంధిజీ ఇట్లు చెప్పెను.

వయోజనవిద్యను గూర్చి నేను చెప్పినదే విశ్వవిద్యాలయ విద్యకు గూడ వర్తించును. అది మన దేశ స్థితిగతులతో అన్వయించునదై యుండవలెను. కనుక బేసిక్ విద్యాక్రమము యొక్క విస్తరణగ లేక తరువాతి మెట్టుగా నుండవలెను. ఇది ముఖ్యవిషయము. ఇందు మీకు నాతో ఏకీభావము లేనిచో, నా సలహాలు మీకు నిరుపయోగము. అట్లుగాక ప్రస్తుతవిద్య మనలను స్వాతంత్ర్య యోధులుగ గాక, బానిసలగా చేసినదని మీ రొప్పుకొన్నచో, ఈ విధానము నంతరింపజేసి జాతీయాశయములకు తగినట్లు సంస్కరింపవలెనని నా వలెనే మీకును తొందర పుట్టవలెను.

నేడు మనవిశ్వవిద్యాలయ పట్టభద్రులు ప్రభుత్వోద్యోగములకై ప్రాకులాడుచున్నారు. లేదా వెడమార్గములు పట్టి

సంఘమునందు అశాంతిని పుట్టించుట ద్వారా తమ నిరాశను వెలిబుచ్చుచున్నారు. ఇతరులను యాచించుటకుగాని, వారి యిండ్లలో సాపాటురాముళ్లుగ బ్రతుకుటకుగాని వీరు వెనుదీయరు. వీరిస్థితి యింత శోచనీయముగ నున్నది. దేశ స్వాతంత్ర్యమునకై బ్రతికి చచ్చు ప్రజాసేవకులను తయారు చేయవలసిన బాధ్యత విశ్వ విద్యాలయములది. కనుక తాలిమీసంఘమునుండి అధ్యాపకులను తీసికొని విశ్వ విద్యాలయ పరిణాళికను బేసిక్ విద్యతో కలిపి, దాని పై మెట్టుగా పరిగణింపవలె నని నా ప్రతిపాదన.

హరిజన్ : 25-8-'46

## కొత్తవిశ్వ విద్యాలయములు

రాష్ట్రములలో క్రొత్త విశ్వ విద్యాలయములు కావలెనను వెర్రి పెరిగిపోవుచున్నది. గుజరాతీకొరకు గాను గుజరాతు కొకటి, అట్లే మహారాష్ట్రమున కొకటి, కన్నడమునకు, ఓఢ్రమునకు అస్సామీకి, మరెన్నిటికో విశ్వ విద్యాలయములు కావలె నని కోరుదురు. సారవంతములగు పై ప్రాంతీయ భాషలకును, వాటిని మాటాడు ప్రజలకును పూర్ణ ఔన్నత్యము చేకూర్చుటకై నచో, ఇట్టివిశ్వ విద్యాలయములు అవసరమే. అయితే ఈ యుద్దేశ్యమును నెరవేర్చుకొనుటలో మనము తూడనితొందర పడుచున్నామని నా భయము.

భాషాప్రయుక్తరాష్ట్ర విభజనము ముందు జరుగవలెను. అప్పుడు ప్రత్యేకరాష్ట్ర పరిపాలన కింద కావలసినచోట నూతన విశ్వవిద్యాలయములు సహజముగ బయలుదేరును. బొంబాయి రాష్ట్రమున గుజరాతీ, మరాఠీ, కన్నడము— మూడుభాష లున్నవి. కనుక వాటికి అభివృద్ధి లేక పోయినది. మద్రాసు రాష్ట్రమున నాలుగు భాషలు—తమిళము, తెలుగు, మళయాళము, మరల కన్నడము. ఇట్లొకదానిపై నొకటి చేరియున్నవికూడ. ఆంధ్రలో ఒక విశ్వ విద్యాలయ మున్నది సరే. కాని పరాధీనము కాని రాష్ట్రపాలనమున్నపు డది ఆక్రమించగల స్థానము వేరు. ఆ స్వేచ్ఛ ఇండియాకు వచ్చి రెండే నెలలైనది. అన్నామలై విశ్వవిద్యాలయ విషయము కూడ ఇంతే. అందు తమిళమునకు ప్రాధాన్యత వచ్చినదని ఎట్లనగలము?

కొత్త విశ్వ విద్యాలయములకు అనుకూల పరిస్థితులేర్పడ వలెను. ప్రాంతీయ భాషలద్వారా విద్యగరపు పాఠశాలలును, కాలేజీలును వానికి పోషకములుగ నుండవలెను. అప్పుడే సరియగు వాతావరణ మేర్పడును. విశ్వ విద్యాలయము దీని కంతకును శిఖరము. మహనీయమగు శిఖరము నిలబడుటకు దిట్టమైన పునాది కావలెను.

రాజ్యాంగ స్వాతంత్ర్యము వచ్చినను, పాశ్చాత్యుల కపట ఆధిపత్యమునుండి మనమింకను బయటపడలేదు. జ్ఞానమంతయు మనకు పాశ్చాత్యుల నుండియే రావలెనని చెప్పు రాజ్యతంత్రజ్ఞులకు నేను చెప్పవలసిన దేమియు లేదు. పాశ్చాత్యులనుండి ఏ మంచియు రాదని కూడ నే నను. కాని ఈ విషయమున మన మింకను ఎట్టి నిర్ధారణకును రాజాలకున్నాము. రాజ్యాంగ స్వాతంత్ర్యము వచ్చినట్లున్నది కనుక విదేశీభాష, విదేశభాషా సాంప్రదాయముల యొక్క సూక్ష్మప్రభావము మనలను విడిచిపెట్టినదని ఎవరును వాదింపరనుకొందును. క్రొత్త విశ్వవిద్యాలయముల స్థాపనకు ఉద్యమించుటకు ముందు మనము నిదానముగ నిలచి, క్రొత్త స్వాతంత్ర్య ప్రాణవాయువుతో మన ఊపిరితిత్తులను నింపుకొనుట వివేకము కదా! దేశముయెడల మనకుగల బాధ్యత మన కట్లని బోధించుట లేదా? విశ్వవిద్యాలయమున కెప్పుడును పెద్ద భవన పంక్తులుగాని, వెండి బంగారు ధన నిధులు గాని అక్కరలేదు. బుద్ధిశాలురగు ప్రజల సదభిప్రాయబలము, అండ దాని కత్యంత ఆవశ్యకము. కావలసినంత అధ్యాపక గణము సిద్ధముగ నుండవలెను. విశ్వవిద్యాలయస్థాపకులు దూర దృష్టికలవారు కావలెను.

విశ్వ విద్యాలయ స్థాపనకు ప్రజాప్రభుత్వము డబ్బు కొరకు వెదకవలసిన పని లేదు. అది ప్రజలకు కావలసి

యున్నచో, వారే ధనమును సమకూర్తురు. వారు ప్రాతి నిధ్యము వహించు దేశమునకు అట్టి విశ్వ విద్యాలయములు అలంకారములుగ భాసిల్లును. విదేశీయుల పరిపాలన కింద ప్రజకు కావలసిన సంతయు పై నుండి వచ్చును. ప్రజల పరాధీనత మరింత హెచ్చును. ప్రజామోదమను విశాలమగు పునాది పై నిలిచినపుడు ప్రతిదియు కిందినుండి పైకి నడచును. కనుక దానికి స్థిరత్వ ముండును. దాని సౌందర్యము ప్రజకు బలము చేకూర్చును. అట్టి ప్రజాహిత విద్యావ్యాప్తికై ఖర్చుపెట్టు ధనము తిరిగి పదిరెట్లు లాభమును ప్రజకు చేకూర్చును. మంచినేలలో చల్లినగింజ లెట్టి ఫల సమృద్ధి నీయగలవో ఇదియు నట్లే. విదేశీయులు స్థాపించిన విశ్వ విద్యాలయములు పై విధానమునకు వ్యతిరేకముగ నడచినవి. ఇది సహజమే. కనుక క్రొత్తగావచ్చిన స్వేచ్ఛను జీర్ణము చేసికొనువరకును క్రొత్తవిశ్వ విద్యాలయములను స్థాపించుటలో బహు జాగ రూకత కావలెను.

హిందూముస్లిం సమస్యను తీసికొనుడు. ఇది మనలను ప్రాణాపాయ స్థితికి దెచ్చినది. మన మెక్కడ గట్టెక్కగలమో చెప్పుట కష్టము. ఊహింపరాని కష్టములు వాటిల్లిన వను కొనుడు. ఇండియన్ యూనియనులో ఒక్క మహమ్మదీయునికి గాని, పాకీస్థానులో ఒక్క సిక్కు లేక హిందువునకు గాని రక్షణ, గౌరవము లేవనుకొందము, దానితో మన విద్య

విషపూరిత మగును. అట్లు గాక, హిందువులు, ముస్లిములు, తదితరులు ఏ రాజ్యమం దున్నను సంపూర్ణరక్షణ కలిగి గౌరవముతో బ్రతుక గలిగినచో, అప్పుడు మన విద్యకు ఇంపైన రూపము వచ్చును. వివిధ మత సాంప్రదాయములకు చెందిన ప్రజలు మైత్రితో బ్రతుకుచు, రమ్యమగు సంస్కృతి సమ్మేళనమును గావించి, దానికి బలమొసంగి చిరకాలము వర్ధిల్ల జేయుదురు. అట్లుగాక హిందూస్థానమున ఒకానొకప్పుడు ఒకే మతము ప్రాతినిధ్యము వహించెనని చెప్పి, వెనుకకు మరలి ఆ దినముకొరకెదురుచూచినచో, చరిత్రలో అట్టి దినము (తేదీ) ఏదియు మనకు దొరకకనే పోవచ్చును. అట్టి దినమే దొరికి, మనము వెనుకంజవేయ ప్రారంభించితిమా మన సంస్కృతిని ఆ వెనుకటి కాలమునకు నెట్టి యావత్సృష్టి యొక్క శాపమునకు పాత్రుల మగుదుము. ఒక యుదాహరణ : దేశచరిత్రనుండి మహమ్మదీయ యుగమును తుడిచివేయు వ్యర్థ ప్రయత్నమునకు పూనుకొంటిమేని, ప్రపంచమున సాటిలేని బ్రహ్మాండమైన ఢిల్లీ జూమా మసీదు, ఆలిఘుర్ ముస్లిం విశ్వ విద్యాలయము, ప్రపంచమహాద్భుతము లేడింట నొకటి యగు ఆగ్రా టాజ్ మహాలు, మొగలుల కాలమున నిర్మింపబడిన ఢిల్లీ, ఆగ్రా కోటలు—ఇవన్నియు ఉన్నవను మాటనే మనము మరచిపోవలసి యుండును. ఆ దృష్టితో దేశచరిత్రనుకూడ తిరుగ వ్రాసికొనవలెను.

ఇట్టి పరస్పర విరుద్ధ భావనల మధ్య సరియైన నిర్ణయము చేసికొనుటకు తగిన వాతావరణము మనకిపుడు లేనే లేదు. రెండు నెలలై వచ్చిన దేశ స్వాతంత్ర్యము తన్నుదా రూపొందించుకొనుటలో కొట్టుమిట్టాడుచున్నది. తుదకది ఏ రూపము పొందనున్నదో తెలియదు. ఈ విషయములు నిర్ధారణ యగువరకును, ఇప్పుడున్న విశ్వవిద్యాలయములలో చేతనైన సంస్కరణము గావించుకొనుచు, అందు స్వాతంత్ర్య తత్వమును చొప్పించుచుండిన చాలును. ఇట్లు మనము సంపాదింపగల అనుభవము సమయము వచ్చినపుడు క్రొత్త విశ్వవిద్యాలయముల స్థాపనకు సాయపడ గలదు.

హరిజన్ : 2-11-'47

# విద్యార్థులు

## విద్యార్థులు వున్నతవిద్యను వదలుకొనవచ్చును

లక్షలాది ప్రజలు తిండిలేక మాడి చచ్చుచుండగా మన బంధుజనులకు అపారవ్యయముతో గూడిన ఉన్నత విద్య నిప్పించుట దారుణకృత్యము. గట్టిదైన అనుభవము నుండి మనోవికాసము కలుగవలెనే గాని, స్కూళ్ళలోను, కాలేజీల లోను అది తప్పక కలుగుననుటకు వీలులేదు. ఉన్నతవిద్య యనబడు దీనిని మనలో కొందరు త్యజించినను, పరిసరములకు అనువగు నిజమైనఉన్నతవిద్యను నేర్చుకొనుట లేక నేర్పించుట యెట్లో మనకు బోధపడును. ప్రతిబాలుడును తనవిద్య కగు వ్యయమును తానే భరించగలమార్గము లేదా? ఉండకనూ పోవచ్చును. ఉన్నను, లేకున్నను అది మనకు అప్రస్తుతము. ఉన్నతవిద్య యనునది వాంఛనీయమే కానిండు. అయినను అధిక వ్యయముతో కూడి కోట్లకొలది ప్రజలకులేని సౌకర్యమును మనము పొందుటకు కచ్చితముగ నిరాక రించుటనే ధర్మసూత్రము. ఇట్టి నిరాకరణశక్తి ఒక్కసారి అకస్మాత్తుగ వచ్చి మనపై వ్రాలదు. అసంఖ్యాక ప్రజకు అందుబాటులో లేని ఆస్తులు, సౌకర్యములు మన మనుభ

పించరాదను మనోవృత్తిని మొదట అలవరచుకోవలెను. దాని ప్రకారము న జీవితములను సరిదిద్దుకొనుట వెను వెంటనే తరువాత జరుగవలసిన పని.

యంగ్ ఇండియా : 24-6-'26

## స్వాంతముగ చదువుకొనుట

స్కూళ్లకు, కాలేజీలకు హాజరగుటవలననే జ్ఞానము లభించునను కొనుట వట్టి మూఢ నమ్మిక. ఈ పాఠశాలలు, కళాశాలలు బయలుదేరక పూర్వమే ప్రపంచమున తేజోవంతులగు విద్యార్థులు తయారయి యుండిరి. స్వాధ్యాయనము వలె ఉన్నతి నిచ్చునది. శాశ్వతమైనది మరేదియు లేదు. పాఠశాలలు. కాలేజీలు విద్యార్థులలో అధికసంఖ్యను పై మెరుగులతో గూడిన నిర్జీవపాత్రలుగ తయారు చేసినవి. గింజలను పారవేసి వట్టి పొల్లు పోగుచేయబడుచున్నది. ఇప్పటి విద్యాశాలలను వస్తుతః నిందించుట నాయుద్దేశము కాదు. వాటి యుపయోగము వాటికున్నది. కాని వాటికీయ గూడనంత ప్రాముఖ్యము మన మిచ్చుచున్నాము. జ్ఞాన సముపార్జనకుగల సాధనము లనేకములలో అవి యొకటి మాత్రమే.

యంగ్ ఇండియా : 25-6-'31

## ఒక విద్యార్థి ఇబ్బంది

ఒక విద్యార్థి ఇట్లు వ్రాయుచున్నాడు.

"దురదృష్టముచే ఇద్దరు ముగ్గురు బిడ్డలనుగన్న, మెట్రిక్యులేటుగాని, కాలేజీచదువు పూర్తికానివాడు కాని జీవనోపాధికై ఏమి కృషిచేయవలెను? ఇరువదియైదేండ్లు నిండకుండ బలాత్కారముగ వివాహితుడైనవాని గతి యేమి?"

నాకు తోచుచున్న సులువైన సమాధాన మిది. తన కిష్టములేని పెండ్లికి ఒడబడి భార్యను బిడ్డలను పోషింపలేని చదువు నిరర్థకము. కాని యిదంతయు ఈతని గతచరిత్ర. ఇప్పుడు కలతనొందుచున్న వాని మనస్సును సమాధాన పరచుటయెట్లు? తనకేమి కావలెనో ఇతడు చెప్పుటలేదు. మెట్రిక్యులేటు హోదాకు తగినఉద్యోగము కావలెననకుండ, సామాన్య కాయకష్టమున కతడు సంసిద్ధుడైనచో తన తిండి తాను సంపాదించుకొనుట కష్టముకాదు. తెలివితేటల నుపయోగపరచి పనిచేసికొన్నచో మందబుద్ధియగు మామూలు కూలివానికంటె అతడు బాగుగ పనిచేయగలడు. ఇంగ్లీషు రాని పనివానికి తెలివితేట లుండవని నా యుద్దేశము కాదు. వివేకములేని బండపరిశ్రమ పనివాండ్ర మనోవికాసమునకు తోడ్పడదు. ప్రపంచమున మరెక్కడను లేని పరభాషా ప్రతిబంధకమున్నను, పాఠశాలలో చదివినవారికి ఎంతో

కొంత మనో వైశాల్యము కలుగును. కాని ఆ సమయము నందే మరొక వైపున గౌరవ మర్యాదలను గూర్చిన తప్పుడు భావములు తలకెక్కును. గుమాస్తా యుద్యోగ మొక్కటే గౌరవమీయదని విద్యార్థుల తలంపు. కనుక పనిపాటులలోని గౌరవమును గుర్తించి పై విద్యార్థి ఆవిధమున కుటుంబ పోషణ చేసికొనవచ్చును.

అతనిభార్యకూడ కాళీసమయమున పనిచేసి కుటుంబ ఆదాయము వృద్ధి చేయవచ్చును. వారి పిల్లలుగూడ పని చేయ గలిగినచో, వారిచేతగూడ ఏదైన వస్త్రోత్పత్తి చేయించవచ్చును. పుస్తకపుచదువు ద్వారానే మానసికాభివృద్ధి కలుగవలెనను భావన పోయి, శాస్త్రదృష్టితో నేర్చుకొను చేతిపనిద్వారా అతి త్వరితముగ మనోవికాసము కలుగ గలదను సత్యము ఋజువు కావలెను. అడుగడుగునను పనిముట్ల నెట్లు ఉపయోగించవలెనో, చేయి యెట్లు తిరుగవలెనో తెలిసికొనుట ప్రారంభమైన వెంటనే విద్యార్థి యొక్క మానసికాభివృద్ధియు ప్రారంభించును. తామును సామాన్య పారిశ్రామికులతో సమానులమని విద్యార్థులు తలచినచో వారి నిరుద్యోగసమస్య సులువుగ తీరును.

హరిజన్ : 9-1-'37.

## విదేశమునందు చదువులు

చదువు నిమిత్తము విద్యార్థులు విదేశములకు వెళ్ళుటకు నే నెప్పుడును అనుకూలుడను కాను. అటనుండి తిరిగివచ్చిన వారికి ఇక్కడి దేశపరిస్థితుల అనుభవములేక పనులు రసాభాసము లగుచు. పరాయిచోట గాక స్వస్థానమునందు సంపాదించు అనుభవమే ఉత్కృష్టమైనది. అదే మానవాభివృద్ధికి దోహద మిచ్చును.

హరిజన్, 8-9-'46.

## విద్యార్థులు-రాజకీయములు

ఐకమత్యముతో పనిచేయు విద్యార్థి సంఘమొకటి యేర్పడినట్లైన, అది మహత్తర దేశసేవాసాధనము కాగలదు. ధనలాభము నాశించు బ్రతుకుకొరకు గాక, మాతృదేశసేవకొరకు యోగ్యతను సంపాదించుటయే దాని ఆశయము. అప్పుడు వారి జ్ఞానము మహోన్నత స్థాయికి చేరును. చదువు పూర్తియైనవారికే ఆందోళన. చదువులో నున్నంతకాలము జ్ఞానాభివృద్ధియే విద్యార్థుల పనియై యుండవలెను. నేడు అమలులో నున్న విద్యావిధానము ప్రజాక్షేమమునకు హానికరమైనది. దేశమున కది కొంత మేలుచేసినదని కొందరనవచ్చును. అది లెక్కింపదగిన మేలుకాదు. దానివలన

ఎవరును మోసపోకుందురు గాక! దేశములో అన్నవస్త్రముల ఉత్పత్తికది యేమైన సహాకరించినదా యన్నదే దాని యుపయోగమునకు ముఖ్యమగు గుర్తు. నేడు జరుగుచున్న మతిమాలిన హత్యల నాపుటకు విద్యార్థులేమి చేయు చున్నారు ? విద్య యంతయు దేశశ్రేయమును ప్రత్యక్షముగ పెంపొందించినదై యుండవలెను. నేటివిద్య అట్టి కర్తవ్యమును నిర్వర్తించిన దని ఎవ రనగలరు ? ప్రస్తుత విధానములోని లోపములను కనిపెట్టి చేతనైనంతవరకు వాటిని నిర్మూలించి తమ జీవితములను కూడ సంస్కరించుకొన ప్రయత్నించుట విద్యార్థి సంఘకార్యములలో నొకటి. విద్యార్థులు తమ మంచి నడవడివలన విద్యాధికారులను కూడ మంచి దారికి దీసికొని రాగలరు. ఈ పని నెరవేర్పగలిగినచో వారు పార్టీ రాజకీయములలో చిక్కుకొనరు. నూతన ప్రణాళికలో నిర్మాణ కార్యమునకు ఉచితస్థాన ముండును. విద్యార్థుల ఋజువర్తనము వలన దేశ రాజకీయములు కూడ పరిశుద్ధము లగును.

దేశ స్వాతంత్ర్య యుద్ధసమయమున విద్యార్థుల శిక్షణ విషయమున నేను చెప్పినమాటలు మరువబడినవి. విద్యా సంస్థలనుండి బయటికివచ్చి రాజకీయములలో పాల్గొన మని నేను విద్యార్థుల నాహ్వానించియుండ లేదు. అహింసాయుత సహాయ నిరాకరణ ప్రబోధమే నేను చేసినపని. విద్యా

సంస్థలను ఖాళీచేసి స్వాతంత్ర్య పోరాటమున దుముకుడని నేను వారికిచ్చిన సూచన. జాతీయ విశ్వవిద్యాలయములను, కళాశాలలను, పాఠశాలలను నెలకొల్పవలసినదిగ కూడ నేను హెచ్చరించితిని.

హరిజన్ : 7-9-'47.

## రాజకీయపక్షములు - విద్యార్థులు

కొందరువిద్యార్థులు గాంధిజీ కొక లేఖ నంపిరి. 9 వ తేదీని జరుగనున్న సమ్మెను ఏర్పాటుచేసిన విద్యార్థులు కమ్యూనిష్టులనియు, కాంగ్రెసువారు కారనియు ఆ లేఖయందుండెను. కాంగ్రెసు అభిమానులు సమ్మెలో పాల్గొనుటలే దన్నందుకు గాంధిజీ వారి నభినందించెను. "పార్టీ రాజకీయములతో విద్యార్థులుసంబంధము పెట్టుకొనరాదని తా నంతకుపూర్వము చెప్పినదేమరల చెప్పుచున్నా" నని ఆయన అనెను. విద్యార్థులలో సామ్యవాదులు కమ్యూనిస్టులు, కాంగ్రెసు ముతా లుండరాదు. వారు ఆదినుండి చివరవరకు విద్యార్థులుగనే ఉండవలెను. చేతనైనంత జ్ఞానసంపాదన చేసి, దానిని ఉద్యోగసంపాదనమునకు గాక ప్రజాసేవకై ఉపయోగపగచవలె నని ఆయన అనెను.

హరిజన్ : 18-1.'48.